[Sri M. Hanumantha Rao] [27th May 1954

యిది ప్రజలశ్రేయస్సుదృష్ట్యా ఎంతమాత్రం చూడబడుటలేదని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను ఈ కమిటీలో యిచ్చిన అభిప్రాయాలు మీదృష్టికి తీసుకువస్తున్నాను. వృత్తిపోయినవారికి నీరానిమిత్తం సొసైటీలను ఏర్పాటుచేసి, బెల్లం తయారు చేయించటానికి, ఏర్పాట్లుచేశామని చెబుతున్నారు. లక్షలమంది యీరోజున, అనేక అవస్థలు పడుతున్నారు ఈరోజున వారంతా చేస్తున్న సత్యాగ్రహమును, మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. సొసైటీలు ఏర్పర్చామన్నారు. అవి ఎక్కడా పనిచేయటంలేదు ఇప్పుడు యీకమిటీ రిపోర్టులోనేవుంది. ఎక్కడైతే మద్యపానము అమలులోవుందో, అక్కడి తాటి, ఈత, కొబ్బరిచెట్లనుండి నీరా తీసుకోనిచ్చేటట్లయితే, అది ఆచరణలో తప్పనిసరిగా వ్యర్థం అవుతుందని శంకరరెడ్డిగారి కమిటీ చెప్పుతున్నది రామమూర్తి కమిటీ నివేదికలో స్పష్టంగా చెప్పబడివుంది.

సొసైటీలు బెల్లం తయారుచేయట మన్నగి. అంతా బోగస్, లెక్కలు ఒకవిధంగా వుంటాయి. ఆచరణలో యింకోవిధంగావుంటుంది. బెల్లం తయారుచేశామని లెక్కలు చూపటం తప్ప వాస్తవంలో అక్కడ ఏమీ వుండదు. ఇటువంటి పాలసీమీద ప్రభుత్వం వ్రేలాడుతూవుంది ఇందువల్ల ప్రజలకు హానికరంగా వుంటుంది కాబట్టి ప్రభుత్వం తమ పాలసీని మార్చుకొని House ముందు దీనిని వుంచటమో తీసివేయుటమో నిర్ణయించటం మంచిది. కాబట్టి రామమూర్తికమిటీలో యిచ్చిన సూచనలను వెంటనే అమలుజరపాలనీ, నీరాను మళ్లా safety valve గా తీసుకొనిరాకుండా యీరోజున యీనిర్ణయాలను, అంగీకరించాలని కోరుతున్నాను. ఆవిధంగా ప్రభుత్వం అంగీకరించకపోతే వారిపాలసీని శాసనసభ్యులంతా తిరస్కరించాలనీ విజ్ఞప్తిచేస్తూ ముగిస్తున్నాను.

Sri M. Rajeswara Rao :— ఈ నాడు ఈ చర్చ చాలా ప్రధానమైనది. రాజకీయాలదృష్ట్యానేగాకుండా ఈ ప్రొహిబిషన్ గురించి, నిష్పక్షికంగా పరిశీలించవలసిన అవసరంవుంది. మద్యపాననిషేధం అమలుజరపాలనే నిర్ణయం చాలామంది ప్రముఖులు సాంఘికంగా ఆలోచించినమీదట అమలుజరపటం జరిగింది. మనరాష్ట్రములోనే యిది ముందు అమలుజరిగిందనేకీర్తి వచ్చింది. 1937 లో కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చినప్పుడుగూడా ఈ మద్యపానం అమలుజరపటం జరిగింది. ఈ విషయము అందరికీ తెలిసినదే. ఎంతో ప్రయాసతో దీనివల్ల వచ్చే 5½ కోట్ల రాబడిని పోగొట్టుకొనికూడ దీనిని అమలుపర్చామంటే దీనిలో చాలా చరిత్రవుంది, చాలా కారణాలు వున్నాయి. బీదప్రజానీకానికి చాలా బాగా ఉపయోగపడిందని గుర్తించాలి.

ముఖ్యంగా యీనాడు prohibition పోవాలనేందుకు తీసుకొనివస్తున్న వాదన ఏమిటంటే, గవర్నమెంటుకు డబ్బులేదని, యింకా ఎన్నో అభివృద్ధిప్రణాళికలు జరుగవలసి యున్నవని, వాటన్నిటికి డబ్బురావడానికి అవకాశంలేదని, కాబట్టి యీ prohibition ను తీసివేస్తే 5½ కోట్లు డబ్బువస్తుందని, దీనివల్ల ఎన్నో పనులు చేసుకోవచ్చునని

చెప్పుతున్నారు. కాని ఈ వాదనతో ఏమాత్రము అంగీకరించడానికి వీలులేదు. ఈ సందర్భంలో ముఖ్యంగా ఒక్కవిషయం ఆలోచించవలసియున్నది. Prohibition తీసివేయడంవల్ల వచ్చే డబ్బు అంతా ఎక్కడనుంచి వస్తున్నదని ఆలోచించినట్లయితే, నూటికి 80 రూపాయలు వంతున హరిజనులనుంచి, బీదప్రజానీకంనుంచి వస్తున్నదని తెలుస్తుంది. కొంతవరకు ఈ డబ్బు మధ్యప్రజానీకంనుంచి కూడ వస్తుంది. కాని ధనికప్రజానీకంనుంచి రావడంలేదు. అటువంటప్పుడు, యీనాడు Prohibition ను తీసివేసి దానివల్ల లభిస్తుందనుకొన్న 5½ కోట్లు హరిజనులనుంచి, బీదప్రజానీకంనుంచి వసూలుచేయడానికి సంసిద్ధులై వున్నారా అని అడుగుచున్నాను. ఇదేనా హరిజనులకు, బీదప్రజానీకానికి శాసనసభ్యులు చేయవలసినది? ఒకవైపు హరిజన అభివృద్ధి పొందవలెనని, వీరి అభివృద్ధికి ప్రభుత్వము అన్నివిధాలా తోడ్పడవలెనని చెప్పుతూ, యీవిషయంలో ముఖ్యంగా వారి అభివృద్ధికొరకు ప్రవేశపెట్టినటువంటి Prohibition ను తీసివేసి వారిజీవితములను నాశనంచేయదలచుకొన్నారేమో ఒకసారి దీర్ఘంగా ఆలోచించవలసిన అవసరమున్నదని మనవిచేస్తున్నాను.

తరువాత దీనిని తీసివేయుటకు రెండవకారణం ఏమిచెప్పుతున్నారంటే, Prohibition సక్రమంగా అమలుజరుపబడడంలేదు. దీనివల్ల ఎక్కడచూచిన దొంగసారాయి తయారుచేయడం, లంచగొండితనం ఎక్కువకావడం జరుగుతున్నదని, ముందుకంటె ఇప్పుడు ప్రజలు ఎక్కువ చెడిపోతున్నారని, యీ Prohibition వల్ల ఏలాటి సత్ఫలితాలు లేవనే వాదన తీసుకొనివచ్చారు. కాని దీనివల్ల సత్ఫలితాలు తప్పకుండా వున్నాయనే చెప్పుతున్నాను. ఇంతకుముందు, అంటే Prohibition లేకముందు ప్రతి ఇంటిలోను ఆడవాళ్లు, పిల్లలు మొదలుకొని ఇంటిలో అందరుకూడ ప్రతిదినము నాలుగు అణాలు, రెండు అణాలు ఖర్చుపెట్టి కల్లుతాగేవారు. అయితే యీరోజున, Prohibition వచ్చిన తరువాత ఎంతమంది మానివేశారో, ఎన్నికుటుంబాలు యిందువల్ల బాగుపడ్డారో గమనించండి. వారు ఈనాడు ఆవిధంగా తాగి డబ్బు పాడుచేసేందుకు అవకాశంలేదు. ఇప్పుడు దొంగసారాచేసి తాగేవాళ్లు కొంతమంది వున్నప్పటికి, మొత్తంమీద చాలమంది తాగేవారు తగ్గిపోయినారు. ముఖ్యంగా హరిజనులు, పేదప్రజానీకం చాలా బాగుపడిందనే చెప్పవలసిన అవసరమున్నది. ముందుకన్నా యిప్పుడు త్రాగడం నూటికి 90 పాళ్లు తగ్గిపోయిందని చెప్పడంలో ఏమాత్రం సందేహంలేదు. అయితే పట్టణాలలో యింకా ఎక్కువమంది తాగుతున్నారనే చెప్పవచ్చును. కాని, మొత్తంమీద కనీసం నూటికి 70 వంతులు తాగడం తగ్గిపోయిందని చెప్పుటకు ఏమాత్రం అనుమానంలేదు. ఈ విషయంలో జిల్లా కలెక్టర్లు యిచ్చినటువంటి రిపోర్టులు చూస్తున్నాము. వాటివల్ల పరిస్థితులు ఏవిధంగా వున్నాయో తెలుసుకోవచ్చు. కర్నూలు కలెక్టరు యిచ్చినటువంటి రిపోర్టులో, ఆడవాళ్లు త్రాగడం చాలా తగ్గిపోయిందని వ్రాశారు. కృష్ణాకలెక్టరుగారు నూటికి 20, 25 మంది త్రాగడం తగ్గిపోయిందని వ్రాశారు. నూజివీడు R. D. O. గారు నూటికి 70 మంది త్రాగడం తగ్గిపోయిందని వ్రాశారు. అంటే నూటికి 25 మంది మాత్రమే త్రాగుతున్నారన్నమాట.

[Sri M. Rajeswara Rao] [27th May 1954

కడప కలెక్టరు నూటికి 20 మంది మానేశారని తెలిపారు. నెల్లూరు కలెక్టరుగారు నూటికి 30 వంతులు తగ్గిపోయిందని వ్రాశారు. మొత్తంమీద నూటికి 50 మంది తాకపోయినప్పటికినీ, కనీసము నూటికి 20, 25 వంతులైనా తగ్గారనుట వాస్తవము. తరువాత హరిజనులు ఏలాగు అభివృద్ధిచెందారో, వారినిగురించిన రిపోర్టులో 1, 2 విషయాలు మనవిచేస్తాను. హరిజనసేవాసంఘాలలో నూటికి 70 మంది త్రాగేవారు తగ్గిపోయారని ఆ రిపోర్టువల్ల తెలుస్తున్నది. తరువాత The Rev F. G. Christenson of Kurnool యీవిధంగా వ్రాశారు—"Prohibition has reduced (drink evil) among the poorer classes but increased among the middle classes" దీనినిబట్టి poorer classes లో చాలావరకు త్రాగుడు తగ్గిందని తెలుస్తున్నది

The Rev. G. S. Isaiah of Nandyal writes like this. "Since Prohibition has been in force in the State, though the aims have not met with every success, it has done much good to the comman man in reducing the evil of drink."

కాబట్టి యీరిపోర్టులన్నీ చూస్తే, హరిజనులలోను, rural classes లోను, పేదప్రజానీకంలోను నూటికి 70 వంతులు త్రాగడం తగ్గిందని చెప్పుటకు ఏమాత్రము అనుమానంలేదు. దీనివల్ల హరిజనులు కొంతవరకు అభివృద్ధిపొందారని, దీనివల్ల సత్ఫలితాలు తప్పక కలిగాయని చెప్పక తప్పదు. ఇంకా కొంతకాలానికి ఇంకా ఎక్కువ సత్ఫలితాలు కలుగుతాయని నమ్ముచున్నాను. Prohibition సరిగా అమలుజరగడంలేదు, అని అంటున్నారంటే, దీనికి ప్రజలందరి సహాయం కావలసియుంటుంది. ఏదైతే మనం ప్రజల అభివృద్ధికొరకు అని చేస్తున్నామో అది మంచిదని తెలుసుకొన్నప్పుడు ప్రజలందరి అభి వృద్ధికి తోడ్పడుతుందని అంగీకరించినప్పుడు, దానిని అమలుజరుపడంలో తప్పకుండా అందరు తోడ్పడవలసియుంటుంది. కంట్రోల్లు తీసివేయకముందు black-market జరుగుతూయుండినప్పుడు, black-market చేసేవారినిపట్టి, శిక్షించేందుకు అనేకపార్టీల వారు ప్రయత్నంచేసేవారు. కాని ఈ విషయంలో ఆవిధంగా అన్నిపార్టీలవారు సహకరించడంలేదు.

An Hon. Member :— Black-market వ్యవహారం ఒకరు, ఇద్దరు వ్యక్తులకు సంబంధించినటువంటిది. అయితే Prohibition విషయంలో majority ప్రజానీకం దీనిని వ్యతిరేకిస్తున్నది.

Sri M. Rajeswara Rao :—అధ్యక్షా! నా టైము వృథాచేస్తున్నారు. నాకు ఎక్కువటైము యివ్వవలసియుంటుంది.

ప్రజలలో ఒకేతూరి గొప్పమార్పుకావాలంటే సాధ్యంకాదు. అందరు ఒకేవిధంగా వుండరు. కనుక యీ Prohibition చట్టము వెంటనే పూర్తి జయప్రదం కావాలంటే

కష్టము. కొద్దికాలము పడుతుంది ఒక కుర్రవాడు బి ఏ పరీక్షలోగాని S S L C. పరీక్షలోగాని ఒకతూరి, రెండుతూర్లు fail అయితే అంతమాత్రాన్నే వీడు పనికిరాడు, చదువు రాదు అని చదువు మానివేయడం జరుగుతుందా? లేదు ఇంకొకసారి అయినా pass అవుతాడనే నమ్మకముంటుంది. అదేవిధంగా Prohibition కూడా ఒక 10, 20 సంవత్సరాలు అమలు జరిగినట్లయితే, సంపూర్ణఫలితము లభించగలదు. దీనిని ఏవిధంగానైన జయప్రదంచేయవలసిన బాధ్యత మనపైన ఉన్నది. దీనిలో ఎక్కువమంది ఉద్యోగస్తులు లంచాలు తీసుకొంటున్నారు, లంచగొండితనము ఎక్కువగావున్నదని అంటున్నారు ఈ విషయంలో ప్రభుత్వం సరియైన కట్టుదిట్టములుపెట్టి ఏ ఉద్యోగస్తులైతే తప్పుచేశారో, లంచాలు ఎవరు తీసుకొంటారో అటువంటివారిపైన చర్యతీసుకొని punish చేపోతుంది. అటువంటివి జరుగకుండా, అటువంటివాటికి తావివ్వకుండా చేయుటకు ప్రజలు కూడ తోడ్పడవలసియుంటుంది.

తరువాత Prohibition వల్ల కల్లుగీతవాండ్రు పనిలేకుండా అవస్థపడుతున్నారని చెప్పారు. అయితే నూటికి 5, 6, మంది కల్లుగీతవాళ్ళకోసం, 90 మంది ప్రజానీకం యొక్క జీవితాలను నాశనం చేయదలచుకొన్నారా అని అడుగుచున్నాను. ఇది ఏమాత్రము సరియైన వాదనకాదు. పనిలేనివారికి వేరేవిధంగా పని చూపించవలసియున్నది గాని, దీనికొరకు ఎక్కువప్రజానీకాన్ని పాడుచేయడం సబబు అనిపించుకోదు. నిజంగా యీనాడు ప్రజానీకం Prohibition వుండాలంటుందో వద్దంటుందో వారిని అడిగి తెలుసుకోండి. మీకే నిజం తెలుస్తుంది. ఎవరో కొద్దిమందితప్ప, అందరుకూడ దీనివల్ల ప్రజానీకం బాగుపడుతున్నదని, prohibition వుండాలనే కోరుతున్నారు. కనుక దీనిని సక్రమంగా అమలుజరుపుటకు ప్రజలు, శాసనసభ్యులు, ప్రభుత్వము అందరు ఏక గ్రీవంగా తోడ్పడవలసియున్నది. ఈ బాధ్యత అందరిపైన ఉన్నది ఈ చట్టమును యింకా ఎక్కువ కట్టుదిట్టములుచేసి సరిగా అమలుజరిపినట్లయితే, తప్పకుండా సత్ఫలితాలు శీఘ్రంగా కలుగుతాయి. ఈవిధంగా చేయుటకు అందరు ప్రయత్నించాలి. ముఖ్యంగా ఇది హరిజనులకు, పేదప్రజానీకానికి ఎక్కువ ఉపయోగపడుతుంది. ప్రభుత్వానికి దీనిమూలాన డబ్బులోటు ఏర్పడితే, వేరేవిధంగా సరిచేసుకోవచ్చు. డబ్బుకావాలని ప్రజలకు హానికరమైన పనులకు పూనుకోవడం మంచిదికాదు. కనుక దీనిని ఏవిధంగానైన సక్రమంగా జయప్రదంగా అమలుజరిగేటట్లు అందరు తోడ్పడవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

**Sri N. V. L. Narasimha Rao:**— ఉపాధ్యక్షా! నేను చాలావడిగా మాట్లాడవలసిన అవసరము వచ్చేటట్లుగావుంది. ఎందుకంటే నాకుముందు మాట్లాడినవారిని చూడగా, వారు గంటకు 70 మైళ్ళరేటులో మాట్లాడినట్లుంది. అందుచేత నేను చెప్పవలసినది చాలా తొందరలోనే చెప్పిముగిస్తాను. ఇప్పటికి రెండుసంవత్సరాలనుంచిమాత్రమే అసెంబ్లీవ్యవహారాలు నాకు తెలుస్తున్నవి. అంతకుముందు పరిస్థితులు నాకు బాగా తెలి

యవు. నేను ఏపుస్తకములో చూచినను యీవిషయాలు నాకు కనబడలేదు. అంతకంటే బహుశ పురాణాలలో ఎక్కడనైనా వుంటుందేమో ఆలోచించవలసివచ్చింది. నాకు రెండు నిదర్శనాలుమాత్రము కనబడ్డాయి అవి ఏమిటంటే, యీరోజు subject చూచుకుంటె, మేము పరిశీలించమని వున్నది. మంత్రిగారు పరిశీలించుచున్నారు. వారు పరిశీలించేదానికి ముందు, మమ్ములను పరిశీలించమని మీఎదుట పెట్టారు. అయితే వారియొక్క అభిప్రాయము నాకు తెలియదు. ఇతరులు ఎవరైనా చేశారాఅంటే, నాకు ఈసందర్భమున ఒకజోతిష్కుడు జ్ఞాపకమువచ్చాడు. వాడు ఒకపిల్లను పెళ్ళిచేసుకున్నాడు. వాడికి తరువాత ఒకపిల్లవాడు పుట్టాడు. ఆ జోతిష్కుడు పెళ్ళిచేసుకొన్నసంగతి మరచిపోయాడు. తరువాత సభలో యీ పిల్లయొక్క భవిష్యత్తు ఏమిటిఅని పరీక్షచేయమనిఅంటే, ఆపిల్లవాడు నాపిల్లవాడుకాదు తీసుకొని వెళ్లమన్నాడట.

Mr Deputy Speaker :— కొంచెము చురుకుగా చెప్పండిమీరు. మీకువున్న యీపదినిముషములలోనే మీకథలు ముగించవలసి యుంటుంది.

Sri N. V. L Narasimha Rao :—అందుచేత యీరోజున యీవిషయము పరిశీలించాలంటే, దీనికి ఒకవిషయము చెబుతాను. ఈరిపోర్టు మేముయిచ్చిందికాదు. ప్రభుత్వము వారే ప్రప్రథమములో ఒక కమిటీని వేశారు. వారుఏర్పాటుచేసిన కమిటీయే కాబట్టి, వారుయిచ్చిన రిపోర్టుమీద వారే తీర్మానము తెచ్చారు. తీర్మానము తెచ్చినప్పుడు, యీకమిటీ రిపోర్టుప్రకారము దాన్ని scrap చేయమని కొంతమంది శెలవిచ్చారు. కమిటీ వారు రిపోర్టుగూడా పంపించారు. కమిటీలో శ్రీశౌంరి రామమూర్తిగారు, శ్రీప్రత్తిపాటి సత్యనారాయణరావుగార్లు వున్నారు. ఆంధ్రదేశంలో అంతకన్నా ఎక్కువ ప్రవీణులు వుండరు. వారు యీవిషయములో మంచి అనుభవశాలురు. పెద్దపెద్దవుద్యోగాలు చేసిన వారు. వారితో సమానులు సాధారణంగా వుండరని అనుకుంటాను. అటువంటివారిని తీసుకొని వచ్చి ఒక కమిటీగా ఏర్పాటుచేసి, వారిచేత ఒక రిపోర్టును తెప్పించారు. రిపోర్టు తెప్పించినప్పటికికూడ వారు ఏదోలాంఛనప్రాయముగా వ్రాసిన రిపోర్టుకాదు. ఆంధ్రదేశచరిత్ర వారికి బాగుగాతెలుసు. వారు పరిస్థితులన్నిచూచి రిపోర్టు తయారుచేశారు. కమిటీలోని వారందరు యీ Prohibition విషయము క్షుణ్ణంగాను, పరిపూర్ణంగాను పరిశీలించారని అనుకొంటాను. వారి రిపోర్టు చదివితే అది సులభంగా అర్థముకాదు. ప్రభుత్వమువారు దాన్ని పరిశీలించారు. ప్రభుత్వము పరిశీలించిన తరువాత వారి పరిశీలనా సారాంశము ఏమిటో తెలియదుకాని, వారు తెచ్చిన తీర్మానము ఏమిటంటే, "నీరా అందరికి పంచిపెట్టమని" అన్నారు. సరే, బాగానేవుంది. నీరా అంటే వుదయము పదిగంటలు మొదలు పన్నెండు గంటలవరకే వుంటుంది. ఆతరువాత అది కల్లుగా మారిపోతుంది. ఈ పన్నెండవగంట దాటిందంటే అది స్వభావసిద్ధంగా మారిపోతుంది. మీకు తెలియదు. కాని నీరా త్రాగవచ్చునని చెప్పారు. అది త్రాగవచ్చునని చెబితే, వెంటనే నీరాత్రాగమన్నారంటే, స్వామీజీగారు

గారు, ఆయనప్రాణము పోతుందిగనుక, ఆయనప్రాణాన్ని రక్షించటానికి నీరా త్రాగవచ్చును అన్నారు కాని, లేకపోతే మరొకవిధముగా అనలేని పేపర్లలో పడింది చూచుకున్నాను ఎందుకంటే మంత్రిగారు ఇచ్చిన స్టేటుమెంటుకూడా మా

[illegible] అక్షరంగా

ప్రతివాడు త్రాగవచ్చునని అన్నారు. ప్రతివాడికి Permit యివ్వవచ్చునని అన్నారు. మంచి నీరావుంటే, త్రాగవచ్చునాఅంటే,

రని అన్నారని అనుకుంటాను. అసలు ఆ నీరాబుడ్లమీద ప్రత్యేకంగా స్వామిసీతారామ్ బొమ్మవేసి బుడ్లను అమ్మితే యింకా బాగుంటుంది. ఇంకొక విషయంకూడా చెబుతున్నాను. స్వామిసీతారామ్ ప్రాణమును రక్షించింది నీరాకాబట్టి, ఆయన బొమ్మవున్న నీరాబుడ్డియే కొనుక్కొని త్రాగండి, లేకపోతే త్రాగకూడదు, అనికూడ ప్రభుత్వము చెప్పవచ్చు అనుకుంటాను. మళ్లా దాని సంగతి ఎత్తలేదు. ఎత్తలేదు కాని దాని విషయముమాత్రం రెండు, మూడుసార్లు చర్చకువచ్చింది. అయ్యా నీరా త్రాగవచ్చునని అంటున్నారు. అటువంటప్పుడు నీరాకుసంబంధించిన Prohibition ఎందుకు పనికిరాకపోయింది ? దానివల్ల అపకారమేగాని, ఉపకారమేమీ జరగలేదు. దీన్ని యీరోజున చర్చకుతీసుకొచ్చారంటే, యిందుకుగాను యీరోజుకేటాయించారు. పెద్దవారిచేత ఒక కమిటీని ఏర్పాటుచేయించుకొని, వారిచేత ఒక రిపోర్టువ్రాయించుకొని తీసుకొనివచ్చారు. ఆ రిపోర్టులో ప్రభుత్వమువారికి నమ్మకములేదు అంటే, మరి ఎవ్వరికి వుంటుంది? వారు వేసిన కమిటీలో వారి రిపోర్టులో వారికే నమ్మకములేకపోతే, యికవారెవ్వరికిరిపోర్టు నమ్ముతారనుకుంటాను. రిపోర్టుసంగతి ఏమిఅంటే, యింకాపరిశీలించలేదని అంటారు Prohibition కు సంబంధించిన డబ్బు మాకు అక్కరలేదు అని ప్రభుత్వమువారు అంటున్నారు. అక్కరలేదని అంటున్నప్పుడు, యీ కమిటీరిపోర్టుకూడా దానికి సంబంధించినదే కాబట్టి, దీన్ని record చేయించివుంటే చాలా సంతోషించేవాడిని. లేదు రిపోర్టు కావాలంటారా సరే కావలెనంటే దాని implement చేయండి. అక్కరలేదంటే రికార్డుచేయించండి. కావలెనని చెప్పరు అక్కరలేదనిచెప్పరు. ఇంకను చూడలేదని తప్పించుకొని పోతున్నారు. ఇలాంటి allusive policy ఎందుకు ? చేస్తే ప్రజలకోరికప్రకారము ధర్మముగా చేయాలి. అంతేకాని, ఎన్నడోవచ్చిన రిపోర్టు యింకా పరిశీలించలేదని చెప్పడము సరియైనపద్ధతికాదు. అవిధంగా మంత్రివర్గంలో కూర్చునిచెప్పడం యీ అసెంబ్లీలోనివారి హక్కులకు చాలా అన్యాయము జరుగుతున్నదన్నమాట. అట్లాంటిది sin-money అవుతుంది, అది మాకు అక్కరకాదని అంటారా ? మహర్షులలాగా కూర్చున్నాము, అటాంటి sin-money మాకెందుకు అంటారా? కాంగ్రెసువారు అయిదువందలకంటె ఎక్కువజీతాలు పుచ్చుకోమని అన్నారు. ఈరోజున వెయ్యిరూపాయలు జీతముతీసుకొంటున్నప్పుడు అది sin-money కాదా ! అది చాలా అన్యాయముకాదా ? ఇదివరకు మూడువేలు, నాలుగువేలు సంపాదించుకునేవారు D. A. లు T. A. లు ఎందుకు తీసుకోవాలి? అందుకనే యీరోజున వరదాచారిగారు చెప్పింది

ఏమిటంటే యిది Constitution కు against గావున్నదని అన్నారు. constitution కు against గా వుంటే, హైకోర్టుజడ్జి సత్యనారాయణరావుగారు, అటువంటివారుకూడా యీరిపోర్టును ఆమోదించారే! ఆయన Constitution చదవకుండా, యీరిపోర్టు వ్రాశారంటారా? సత్యనారాయణరావుగారు స్పష్టముగాచదివి, యీ point of order raise చేస్తూ దీన్ని అడ్డగించరా? Constitution లో Prohibition కు అర్థము విపులంగానే యిచ్చారు. గ్రామాలలో పెద్దలు ఎంతమంది Prohibition అక్కరలేదని అంటున్నారో ప్రభుత్వము గ్రహించినట్లులేదు. ప్రతివాడు ప్రమాణంచేసి చెబుతున్నానని అంటాడు. దానికి ఎంత విలువవుందో చూడండి. "దేవుని ఎదుట ప్రమాణముచేసి అంతా నిజము చెబుతాను" అని అంటాడు. దీనికి అర్థము ఎట్లావుందంటే దేవునిఎదుట చెబుతాను అన్నానేగాని, వారిఎదుట ప్రమాణముచేసి చెబుతున్నానా? అని అన్నమాట.

గోపాలరెడ్డిగారు Prohibition తీసివేస్తే, కాంగ్రెసులోనుంచి వెళ్లిపోవడమేనని అన్నారు. అట్లాఅయితే సంజీవరెడ్డిగారుకూడా కాంగ్రెసులోవున్నారు. ఇక ఆయన సంగతి ఏమిటో ఆయనే ఆలోచించుకోవాలి. కాంగ్రెసులో వున్నవారు ఎంతమంది త్రాగడము లేదోచెప్పమని వారిని అడుగుతున్నాను. ప్రకాశంపంతులుగారు కాంగ్రెసులో వున్నంతవరకు నేనుకూడా కాంగ్రెసులోవున్నాను. నేను తాగనుకాబట్టి నన్ను కాంగ్రెసులో నుంచి వెళ్లగొట్టారేమో నని అనుకుంటున్నాను. మా గుంటూరులో టౌనుకాంగ్రెసు ప్రెసిడెంటు, వైసుప్రెసిడెంటు యిద్దరుత్రాగేవారే. వారు యిద్దరు రోజు నావద్దకువస్తారు. మీరు సాయంత్రమువేళప్పుడు మాత్రం రావద్దు, ఉదయముపూటరండి అని అంటూవుంటాను.

Sri S. Narayanappa — On a point of order Sir, గుంటూరు టౌను కాంగ్రెసు ప్రెసిడెంటు, వైసుప్రెసిడెంటు త్రాగుతారని బహిరంగంగా యీసభలో చెప్పటము తప్పుకాదా? వారిని అగౌరవపరచినట్లుకాదా?

Sri N. V L. Narasimha Rao :—వారు యిద్దరు నాకు చాలా ముఖ్యులు. అందుచేత నేను వాళ్లను పోలీసువాళ్లకు పట్టివ్వను. దీనివల్ల కాంగ్రెసులో వున్నవారుకూడా త్రాగుచునేవుంటున్నారు. గనుక దాన్ని మనము అర్థముచేసుకొంటే దానియొక్క విలువ కనబడుతుంది.

సత్యనారాయణరావుగారు వ్రాసిన రిపోర్టులో ఒకభాగము చదువుతాను వినండి.

**(Justice Satyanarayana Rao): "The Prohibition Act was enacted with good intentions and was conceived bona fide. At that time nobody would have imagined or expected that this experiment with human material would end in such disastrous consequences. Our hopes were not realised, our expectations were frustrated and our calculations were upset. In such a situation nobody suggests that the directive principles should be disregarded by the State but that it**

should be pursued along a different path retracing the steps already taken. There is nothing unconstitutional in going back and pursuing another new path to achieve the objective indicated in Article 47."

ఇది నేను పైరే తర్జుమా చేయ సక్కర్లేదు. అంతేకాకుండా, వారు ఆఖరు పేజీలో కూడా చెప్పారు. ఈ మోస్తరుగా ఏర్పాటు చేయవచ్చునని వారు 14 సూచనలు యిచ్చారు. ఈ 14 సూచనలను ఒప్పుకుంటే నష్టంలేదు. అయితే, నేను యీ commands ను disobey చేయటంలేదు. నేను pleader గా practice చేస్తున్నాను. ఈ త్రాగేవారిలో యెక్కువమంది పేదవారే అని అంటున్నారు. కాని భాగ్యవంతులు యెంతమంది త్రాగుతున్నారో చూడండి. ఇంగ్లండులోనుంచి వచ్చే liquors మీద పన్ను వేస్తున్నా భాగ్యవంతులలో నూటికి 70 మంది అధమపక్షం త్రాగుతున్నారు. కల్లుదుకాణంలో త్రాగుతున్నాడనే కారణంచేత పేదవారిని పట్టుకొని పోలీసువారు Police Station కు తీసుకువస్తున్నారు. Police Station కు తీసుకొనివెళ్లే పేదవాళ్ల యెడల అభిమానంతో నేను Criminal Cases లో పేదవాళ్ల తరఫున వకాల్తా తీసుకొన్నవాడిని గనుక యిదంతా చెబుతున్నాను.

మా గుంటూరుజిల్లాలో యీ రోజున పేదవారు cent per cent jails లో వున్నారు. వాళ్లు త్రాగలేదని నేను bail applications వేస్తున్నాను. లేకపోతే, యిందులోవుండే రహస్యం యేమిటంటే వీళ్లను తీసుకువచ్చే Police Constables త్రాగుతున్నారు. కోర్టులో వాదించే pleaders త్రాగుతున్నారు. Magistrates త్రాగుతున్నారు. త్రాగనివాడిని నే నొక్కడినే. నన్నే విచారించమని అడుగుతున్నాను. అందుచేత యీ Prohibition సమస్యను చాలా serious గా ఆలోచించండి. ఇప్పుడు బ్రహ్మాండమైన పెద్దనాయకులైనవారు యిచ్చిన report ను మీరంతా జాగ్రత్తగా ఆలోచించి, అంగీకరించవలసినదని నేను కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. Narasimha Reddi :—అధ్యక్షా! ప్రధానంగా యీ Prohibition issue ఒక సాంఘిక విషయం అయినప్పటికీ, కొంతవరకు ఆర్థికవిషయం అయినప్పటికీ ముఖ్యంగా దీనిని రాజకీయంగా తీసుకోబట్టే యీ రోజున యీ సమస్యకు యింత దురదృష్టం పట్టిందని నేను చెబుతున్నాను. ప్రధానంగా దీనిని రాజకీయంగాతీసుకొని, ప్రభుత్వమునికీ దీనికీ ముడిపెట్టి యీ Prohibition కు వ్యతిరేకించిచెప్పినట్లయిన వోటుచేసినట్లయిన యీ ప్రభుత్వము పడిపోతుందేమో యనే భయంతో కొంతమంది సభ్యులు, హృదయములో వ్యతిరేకభావములు వున్నప్పటికీ, అనుకూలంగా చెప్పవలసివస్తోంది. కొంతమంది సభ్యులు యీ House లో వ్యతిరేకంగా మాట్లాడారు. కొంతమంది అనుకూలంగా మాట్లాడారు. కాని యధార్థంగా పరిస్థితులు వున్నది వున్నట్లుగా తీసుకొని, ఆర్థిక సాంఘిక పరిస్థితులదృష్ట్యా యీ చట్టమును తీసుకొని, చూచినట్లయితే, యీ Prohibition act ను నూటికి 80 మంది వ్యతిరేకంగా వోటుచేస్తారు. దీనివల్ల ప్రజలకు చేకూరే లాభము యేమి

లేదు. పల్లెప్రాంతాలలోని ప్రజలు అమ్మోనియా సల్ఫేటు వేసిన సారాయిని త్రాగుటవలన అనేకమంది చచ్చిపోతున్నారు. ఇది నాకు తెలుసు. మా ప్రాంతాలలో కనీసము 4 గురు అయినా చనిపోయారు. సారాబట్టీలు వూరూరా పెట్టడంవల్ల, వాటిని యీరోజున ప్రతి యింటిలో పెట్టడంవల్ల చాలా కొంపలు ముఖ్యంగా పూరియిండ్లు తగులబడిపోయినవి. అవి యేదో నేను చాలా చెప్పగలను. పూర్వకాలంలో పురుషులకు మాత్రమే త్రాగుడువుంటే, యిప్పుడు స్త్రీలు, చిన్నపిల్లలుకూడా త్రాగడం మొదలుపెట్టారు. ఈరోజున సారాను ఒకచోటినుండి యింకొకచోటికి చేరవేయడానికి స్త్రీలనూ, చిన్నపిల్లలను వుపయోగించటం వల్ల, అంతా త్రాగడం జరుగుతున్నది అందుచేత, స్త్రీలు, బిడ్డలు చనిపోవడం జరుగు చున్నది. అనారోగ్యంవలన చాలామంది పేదప్రజానీకానీకం బాధపడుతున్నారు. పేదపల్లెల్లోకిపోతే, వీరు దేనిని కోరుతున్నారో, నిజమైన లెక్కలను యివ్వగలనని నేను మనవిచేస్తున్నాను. ఈ నాడు కూలీలలోగాని, కార్మికులలోగాని దేహదారుఢ్యం తగ్గిపోయింది. కారణం యేమిటంటే, సాయంకాలము నాలుగు గంటలు అగుసరికి ప్రతి కూలీకూడా దొంగతనంగా సారాయి యెక్కడ దొరుకుతుందా అని ఆలోచించి, అది దొరికేందుకు మార్గాలు ఆలోచిస్తువుంటాడు కాబట్టి, పనియొక్క efficiency, labour efficiency తగ్గుతూ ఆరోగ్యం తగ్గింది. ఆ విధంగా చూచినా యిది చాలా నష్టదాయక మని చెబుతున్నాను. ప్రజలు బాగుపడుటలేదు.

ఈరోజు ఆర్థికంగా యెంతో కష్టపరిస్థితులలో వారు వున్నప్పుడు, ఆర్థికంగా కాయ కష్టాలవల్ల డబ్బురావాలని కొందరు చెప్పవచ్చును. Prohibition తీసివేసి తద్వారా ప్రత్యక్షంగా ప్రభుత్వానికివచ్చే ఆదాయం అంతా తీసుకుపోయి, వ్యవసాయాభివృద్ధికి ఖర్చుపెట్టి, యీ పేదప్రజానీకం యొక్క ఆర్థికపరిస్థితులు బాగుచేస్తే, ఆవిధంగా ఆర్థికాభి వృద్ధికి positive గా పనిచేసి, వారిని విద్యావంతులుగా చేసినయెడల, వారిని Prohibition Officers ద్వారా నైతికంగా త్రాగుడు మాన్పించటం చాలావరకూ సాధ్యం. లేనియెడల చట్టాలు, జైళ్లు, యీ Special Officers వారిని త్రాగుడునుండి మాన్పింపజాలరు. అందుచేత, వారిని ఆవిధంగా ఆర్థికంగా అభివృద్ధిచేసి, విద్యావంతులుగా చేసి, వారిని సాంఘికజీవనంలో సమానంగా తీసుకొని వచ్చినయెడల, వారు త్రాగుడును మానుకొంటారు. విదేశాలలోకూడా త్రాగుడు అలవాటువున్నది. విదేశాలలో పెద్దవారు, యెక్కువగా చదువుకొన్నవారుకూడా త్రాగుటవలన, యీ చట్టము అక్కడ కూడా విఫలమైనదని మనమంతా చూస్తున్నాము. ఈ చట్టమువల్ల త్రాగుడు అభివృద్ధి అయిందేకాని తగ్గలేదు. అనేకమంది ప్రజలు యీ త్రాగుడుకు అలవాటైనందువల్ల, యిప్పుడు యెక్కువకాలం పనిచేయలేక, వారివృత్తులను విడిచిపెట్టిపోయారు. ఈ చట్టం రావటంవల్ల మాజీగీతపనివాండ్రకు పనిదొరకకపోవటంచేత గ్రామాలను విడిచిపెట్టి పోయారు. వారి కందరకూ యీరోజువరకు వృత్తి కల్పించలేదు. ప్రభుత్వము చట్టమును వుల్లంఘించినవారిని

జెయిలులలో పెడుతున్నారు. కాని, Jails లో పెట్టబడినవారికి కూడా గంజాయి, భంగు చిక్కుతూవుంది. ఈ రోజున Police ఉద్యోగస్థులు చాలామంది త్రాగుతున్నారు. ఉదాహరణకు, ఒక ప్లేస్లో పోలీసులు 10 గాలన్ల సారాయిని పట్టుకుంటే, అందులో 9 గాలన్ల సారాయిని పోలీసులే త్రాగుతున్నారు. ఎక్కడైనా, యెవరైనా యీ చట్టం బాగా అమలుజరుపబడుతోందని చెప్తే, దానికి ముఖ్యకారణం, వారు దొంగ సారాయి తయారుచేసి, డబ్బు సంపాదించుకొనేందుకు, యీ రోజున యీ చట్టం వుండాలని చెబుతున్నారు. దీనికితోడుగా లంచాలకు తినుటకు అలవాటుపడినవారు గనుకనూ, త్రాగుటకు అలవాటుపడినవారు గనుకనూ, యీ Prohibition Officers, Police Officers, constables యీ చట్టం వుండాలని చెబుతున్నారు. తమ ప్రతిష్ఠ యెక్కడపడిపోతుందో అని, కాంగ్రెసువారు యీ చట్టాన్ని యింకా అమలుజరుపవలెనని చెబుతున్నారు. నిజంగా ప్రజల మేలును కోరేవారు యెవ్వరూ యీ విధంగా చెప్పటములేదు. మొత్తంమీద దీనికి అనేకమంది వ్యతిరేకంగా వుండటంవల్ల దీనిని తీసివేయటం చాలా మంచిది. అందుచేత, శ్రీ రామమూర్తి కమిటీవారి నివేదికలోని చతుర్దశ అంశాలను త్వరలో తప్పక అమలులోకి తీసుకురావాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri D. Dasaratharamiah Naidu — ఉపాధ్యక్షా! ఈ రోజున మనం రాజకీయంగా అభివృద్ధిపొందాము; రాజకీయం నేర్చుకొన్న నాటినుంచీ ఉన్న పాలసీని మనం ఇక్కడ డిస్కస్‌చేస్తున్నాం. ఏ రోజున రాజకీయాల్లో ప్రవేశించామో ఆ రోజు నుంచి కూడా ఈ ప్రొహిబిషన్ అనేది కూడా ఒక పాలసీగా పెట్టుకొన్నాం. మనకు స్వాతంత్ర్యం వచ్చినతరువాత మొట్టమొదట మనం పరిపాలనచేయడానికి వచ్చినప్పుడే 1937 వ సంవత్సరంలో ఈ ప్రొహిబిషన్ యాక్టును కొంతవరకు రాష్ట్రంలో ప్రవేశపెట్టాం. దానితరువాత వెంటనే దురదృష్టవశాత్తు ఆ ప్రభుత్వం రిజైన్‌చేయడం జరిగింది. సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించడంకోసం జైళ్లకుపోవడం జరిగింది. వెంటనే వచ్చిన అడ్వైజరీ కమిటీవారు దాన్ని తీసేశారు. ఆ కమిటీలో శ్రీ రామమూర్తిగారుకూడా ఉన్నారు. తిరిగి వారినే ఈ కమిటీలో వేయడం ప్రభుత్వం పొరపాటుచేసిందని చెపుతున్నాను. శ్రీ రామమూర్తిగారికి కొన్ని అభిప్రాయాలు ఉన్నాయి. అటువంటి అభిప్రాయాలు ఉన్న వ్యక్తులను యిందులో వేశారు. వారిని వేయకుండా ఉంటే బాగుండేది. శ్రీ నరసింహారావుగారు మాట్లాడుతూ కాంగ్రెస్‌వారిలో కూడా త్రాగేవాళ్లు ఉన్నారని చెప్పారు. వారు త్రాగడంలేదని అందుచేత కాంగ్రెసునుండి బైటికి వెళ్లామని చెప్పారు. బహుశా బైటికివెళ్లి త్రాగడం మంచిదని బైలుదేరి వారు బైటికివెళ్లారని అనుకుంటాను. కాని వారిని కాంగ్రెస్ నుండి ఎవరూ వెళ్లగొట్టలేదు. మనము కొన్ని ఆశయాలతో ఈ ప్రొహిబిషన్ చట్టాన్ని ప్రవేశపెట్టాం. ఆ ఆశయాన్ని నిర్వహించడానికి ఎటువంటి సక్రమమైన ప్రయత్నం చేయకుండా, దానికి మనం యివ్వవలసిన ప్రోత్సాహం యివ్వకుండా యిది చెడిపోయింది

కాబట్టి మనం తీసేస్తే బాగుంటుందని చెప్పేకంటే దీనికి ప్రోత్సాహమిచ్చి సక్రమంగా జరపడానికి ప్రయత్నిస్తే బాగుంటుంది. ఒక సంఘసంస్కరణ కావాలని అంటే దాన్ని చేయడానికి చాలాకాలం పడుతుంది. మనకు స్వరాజ్యంవచ్చి ఏడుసంవత్సరాలు మాత్రమే అయింది. ఒక జాతి చరిత్రలో బ్రహ్మాండమైన సంస్కరణ తీసుకురావడం అంటే ఏమంత సులభమైన విషయం కాదు. అయితే ఇది విఫలం అయిందని చెప్పి దీనివల్ల మళ్లీ త్రాగడం నేర్పుతున్నామని చెప్పేవారంతా కూడా ఈ సంఘసంస్కరణ సక్రమంగా అమలుజరిగేవిధంగా ప్రయత్నంచేయడం మంచిదని చెపుతున్నాను. ఈ సంఘ సంస్కరణ ప్రభుత్వంవల్ల, ప్రభుత్వ సిబ్బందివల్ల మాత్రమే అమలుజరగదు. ప్రభుత్వంవల్ల ఏ సంస్కరణా సంపూర్తిగా, జయప్రదంగా జరగదు. ప్రభుత్వంలో ఉన్న మనం, ప్రజలనుంచి కూడా సంపూర్ణ సహకారం వచ్చినప్పుడు బ్రహ్మాండమైన సంఘసంస్కరణలను అమలు చేయ కలుగుతాం. సంఘసంస్కరణ మంచిదని చెప్పేటప్పుడు త్రాగమని చెప్పడంకంటే త్రాగవద్దని చెప్పి, ఆ సంఘసంస్కరణను అమలుజరపడానికి ఎందుకు ప్రయత్నం చేయరో తెలియకుండావుంది. దయయుంచి మీరు మీ రాజకీయాలతోబాటు ఈ సంఘసంస్కారమును కూడా బోధించి, ప్రజలు బాగుపడేవిధంగా చేయడానికి ప్రయత్నించమని ప్రార్థిస్తున్నాను.

Sri R. Siddanna Gowd:—మీరు ఇంతవరకు ఏమి బాగుచేశారని అడుగుతున్నాను ?

Sri D. Dasaratharamiah Naidu — మీరు మేము కలిసి చేద్దాం అని, నాతో ఏకీభవించమని శ్రీ సిద్ధన్న గౌడ్ గారికి నేను చెబుతున్నాను. దీనిలో ప్రభుత్వానికి కూడా ఒక మనవిచేస్తున్నాను. ఈ నీరా అనేది వస్తున్నది. కాబట్టి ఈ విషయంలో నీరా అనేదికూడా పూర్తిగా లేకుండా చేయమని ప్రార్థిస్తున్నాను. నేను మొదట ఈ ప్రొహిబిషన్ ఆక్టు వచ్చినప్పుడే చెప్పాను. అప్పుడు శ్రీ విశ్వనాథం పంతులు గారు, శ్రీ ప్రకాశం పంతులుగారు కూడా ఉన్నారు. తరవాత ఇదంతాకూడా శ్రీ విశ్వనాథంగారు ప్రతిపక్షంలోకి వెళ్లడంవల్ల వచ్చింది. కాబట్టి శ్రీ విశ్వనాథంగారు కొంత ప్రయత్నంచేసి దాన్ని పూర్తిగా అమలుజరపడానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. ప్రతి పక్ష సభ్యులు ఈ సంఘసంస్కరణలకు తగినంత ప్రోత్సాహమిచ్చి సముద్ధరించమని చెపుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri G. Satyanarayana :— ఉపాధ్యక్షా ! ఆరు నెలలు అయినతరువాత ప్రొహిబిషన్ కమిటీ రిపోర్టు మనముందు చర్చించబడుతున్నది. చర్చించబడ్డంలోకూడా యిందాక మనమిత్రులు శ్రీ నరసింహారావుగారు చెప్పినట్లు దాన్ని పరిశీలనకోసం మనముందు పెట్టారు. గత 3 నెలల క్రిందట మంత్రిగారు కమిటీని వేస్తున్నామంటే దానికోసం కమిటీ అనవసరం. వాస్తవపరిస్థితి మన అందరకుకూడా తెలుసు, అని చెప్పినప్పుడు, ఎందుకు ! త్వరలోనే వారి రిపోర్టు వస్తుందని చెప్పారు. కమిటీని వేశారు, ఆ కమిటీని వేసినతరవాత వారు పరిశీలించి ఒక

రిపోర్టు యిస్తే, ఆ రిపోర్టు ఇప్పుడుపరిశీలనకు మన ముందు పెట్టారంటే దురదృష్టవశాత్తు యిదమిద్ధమని మన ప్రభుత్వానికి ఒక విధానం లేదని చెప్పవలసివస్తున్నది. ఇదివరకు మార్చి మీటింగులో దాన్నిగురించి చర్చించాలని చెప్పినప్పుడు ప్రత్యేకించి దానికి ఒకరోజు ఇస్తాం, ఇప్పుడు మమ్మల్ని బ్రతికించమని కోరితే, ఆరకంగా చర్చించడానికి ఒకరోజు ఇస్తున్నాం అని అంటున్నారు. కాబట్టి మిమ్ములను మేము బ్రతికించ తలుచుకున్నాం అనికొంతమంది సభ్యులు హామీ యిచ్చి బ్రతికించారు తిరిగి ఇప్పుడు కమిటీరిపోర్టు మనముందుకు వచ్చింది. కాని దాన్ని నానఫీషియల్ రోజున తీసుకొచ్చిపెట్టారంటే, అనధికారరోజున బంజరుభూముల గురించి మనం చర్చించినప్పుడు దానికి ఎటువంటి గతి పట్టిందో అలాంటి గతే దీనికీ పడు తుందని మంత్రిగారి ఉద్దేశమేమో ఇప్పుడుకూడా ఈ రిపోర్టు ఇక్కడ చర్చించిన తరవాత ఫలానారీతిగా ఇది చేయబోతున్నాం అని ఎలాంటి సూచనకూడా ప్రభుత్వం యివ్వలేదు. "ఈ బాధ్యత అంతా నేను నిర్వహిస్తున్నందువల్ల" అని మంత్రిగారు దానిమీద సంతోషం వెలిబుచ్చారేకానీ, ఏవిధంగా దాన్ని అమలుపెట్టడం అనే విషయం వారిదగ్గరనుంచి రాకపోడం దురదృష్టం. బహుశా మరో తీర్మానం రేపు రాబోతున్నది. అది రేపు వస్తుంది. అది ఏమైనా సరే అని వారు ఇక్కడ ఉన్నారు. కమిటీ రిపోర్టు ఇచ్చారు. ఆరిపోర్టు ఇంకా బైటకిరాకముందే రిపోర్టు ఏమి ఇచ్చినా మేము ఖాతరుచేయవలసిన అవసరంలేదని ఒకవైపు, ఈ రిపోర్టు వచ్చినతరవాత ఆయన ఈ రిపోర్టు పక్షపాతదృష్టితో యిచ్చారని రెండవవైపూ చెప్తూవచ్చారు.

కమిటీని నిర్మాణం చేస్తున్న సమయంలో కమిటీని వేయవద్దని చెప్పి మా కమ్యూనిస్టుపార్టీ తరఫున, వ్యతిరేకిస్తూ అనేకసార్లు మీకు మేము మనవిచేసినమాట వాస్తవమే. ఆ కమిటీవారు యించుమించు రాష్ట్రంలో అన్నిప్రదేశములందు తిరిగి, సమాచారమును సేకరించారు. వారు తక్కువవ్యవధిలో చాలా ప్రదేశాలు వెళ్లారు. వారు అనేకసంస్థలను అనేకమంది పెద్దలను సంప్రతించి మునిసిపాలిటీల దగ్గర్నుంచి అనేక పంచాయితీలవద్దనుంచి, అనేక association ల దగ్గర్నుంచి యీ మద్యనిషేధ చట్టాన్నిగురించిన సమాచారాన్ని సేకరించారు. ఈ కమిటీవారు మొత్తం 138 మందికి, ఈ report కు సంబంధించిన questionaire ను పంపారు. ఇంకా M. L. A. లకు, ఇతర పెద్దలకు కూడా వారియొక్క అభిప్రాయములను సేకరించుటకై పంపారు. వారందరూ, ప్రొహిబిషన్ సక్రమంగా కొనసాగటంలేదు కనుక దీనిని వెంటనే తీసివేయాలనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కాని ఒక వరదాచారిగారు మాత్రం ఈ ప్రొహిబిషన్ సక్రమంగా అమలుజరుపబడుతోంది, దానిని తీసివేయ నవసరంలేదని అన్నారు మొత్తం ఈ విధంగా సాక్ష్యమిచ్చిన వారందరిలో ఒక వరదాచారిగారొక్కరే ఆవిధమైన ఉద్దేశ్యం వెలిబుచ్చారు. తరువాత 24 Bar Association ల నుంచి సూచనలు వచ్చాయి. వారు వ్యక్తంచేసిన అభిప్రాయాలను, యిచ్చిన సాక్ష్యాలనుబట్టి చూస్తే, చాలా Bar Associa-

tions వారు దీనికి చాలా వ్యతిరేకంగా ఉన్నారు. మొత్తం 24 Bar Associations వారు సాక్ష్యము యిచ్చారు. ఆ 24 Bar Associations లోనూ ఒక్క గురజాల Bar Association మాత్రం ఇది బాగా జరుగుతోంది, దీనిలో ఇంకా ఏవో కొద్ది మార్పులు చేస్తే సరిపోతుంది అని చెప్పి ఒక సూచన చేశారు. తతిమ్మా 23 Bar Associations ఒకేరకమైనటువంటి సూచనలు చేసినవి. ఇలాగే కొన్ని కొన్ని Association ల నుంచి, మహిళాసమాజాల నుంచి వచ్చినటువంటి సూచనలు, అభిప్రాయాలనుబట్టి చూస్తే ఎక్కువ మంది మహిళలు ఈ మద్యనిషేధాన్ని తీసివేయాలనిచెప్పి సూచించారు. అందులో మన శాసన సభ సభ్యురాలు, శ్రీమతి కోటమ్మ రెడ్డిగారు యీవిధంగా evidence ఇచ్చారు అందులో "Prohibition has been an utter failure in Andhra" అని వున్నది. Prohibition councils, అంటే official councils నుంచి కొన్ని సూచనలు వచ్చాయి. అందులో 1[illegible] councils ఇది విఫలమైపోతోంది. ఇది పనికిరాదనే సూచనలిచ్చాయి. ఉదాహరణలు ఈ విషయమై కావాలంటే వారియొక్క సాక్ష్యములు ఉన్నాయి, వాటిని చూచినట్లయితే తెలుస్తుంది. Joint Registrar of Cooperative Societies యీ Prohibition అమలులోకి వచ్చినతరువాత, ఈ కల్లుపరిశ్రమ ఒక cottage industry గా తయారైందని అన్నారు. తరువాత రాజేశ్వరరావుగారు చెప్తూ కలెక్టర్లుకూడా ఈ మద్యపాననిషేధం గురించి ఒక రిపోర్టు యిచ్చారు, దానిలో త్రాగేవారిసంఖ్య తగ్గిందని వారు సూచించారని అన్నారు. కావాలంటే collectors యీ Prohibition గురించి ఎటువంటి reports, ఎటువంటి అభిప్రాయాలను యీ కమిటీవారి కిచ్చారో నేను ఒకటి చదివిచూపించుతాను. కర్నూలు కలెక్టరుగారిచ్చిన రిపోర్టును ఉదాహరణగా చదివి వినిపించుతాను.

"During municipal elections in Kurnool and Nandyal in September 1953, lorry loads of liquor were taken round and distributed. During the legislative elections in January 1952, liquor was taken round to villages to get votes." This is Sri Sankara Reddi's constituency (Laughter).

ఇంకా ఆయన ఇలా చెప్తున్నారు.

"There was also extensive cultivation of ganja"

దొంగసారాను కాచే బట్టీలన్నీ అక్కడేవున్నాయి. ఆ వృత్తే అక్కడ ఎక్కువగా ఉందని చెప్పారు. ఆ సారాను అక్కడ ఉండే కొండజాతులవారు "The Sugalies, Boyas, Chenchus, Harijans and Erukulas are the classes that are mostly engaged in illicit distillation. Some big people are behind them." వీరు వాటిని తయారుచేస్తున్నారని, వీరివెనకాల పెద్ద పెద్ద భూస్వాములు ఉన్నా

రని; వారు ఆ కొండజాతులవారిని ఉపయోగించుకొంటున్నా"రని వారు అన్నారు. అనంతపురం కలెక్టరుగారు కూడా .. . . . ....(Interruption.)

Sri M. Rajeswara Rao — నేను ఈ Collector ఇచ్చిన యీ reports అన్నిటిని గురించి చెప్పలేను, ఎటువంటి ఉదాహరణగా చెప్పలేను కాని వారు యిచ్చిన report లో మాత్రం ఆడవాళ్లలో, పిల్లలలో త్రాగేవారి సంఖ్య హెచ్చుటం లేదు తగ్గలేదు అని వ్రాసిన మాత్రమే నేను చెప్పాను.

Sri G. Satyanarayana — మీరు Collectors అందరినిగురించి ఉదహరించారు. ఈ కమిటీరిపోర్టును వీరందరూ యిచ్చిన సూచనలనుబట్టి చూస్తే ప్రతిజిల్లాలో కూడా ఈ Prohibition వల్ల ప్రజానీకం లాభం పొందేది అట్టేపోయి, వారిపై కేసులు ఎక్కువవుతున్నాయి. మా పశ్చిమగోదావరిజిల్లాలో రోజు రోజుకు కేసులు విపరీతంగా ఎక్కువవుతున్నాయి. మొన్న 31 వ మార్చి ending లో లెక్కచూస్తే 1555 కేసులు ఉన్నాయి. ఇన్ని కేసులు వస్తూవుండగా ఈ మద్యపాననిషేధాన్ని తీసివేయమంటారు. ఇపుడున్న పరిస్థితులలో ఈ మద్యనిషేధం సరిగా అమలు జరుపబడుట లేదని పెక్కుమంది పెద్దవారు యిచ్చిన అభిప్రాయములనుబట్టి సూచనలనుబట్టి తెలుస్తోంది. అందుచేత రామమూర్తి కమిటీవారిచ్చిన recommendations ను కనీసం యీ అవకాశాన్ని పురస్కరించుకొనైనా అమలుజరిపేలాగున మంత్రివర్గం పూనుకోవాలని విజ్ఞప్తిచేస్తున్నాను. ఇదేరకంగా మంత్రిగారు వారి అంత్యోపన్యాసంలో, అంత్యోపన్యాసం కాదు, ముగింపు ఉపన్యాసంలో తెలియజేయాలని విజ్ఞప్తిచేస్తున్నాను. ఈ విషయమై తగినసూచనలను ఆమోదించమని ఈ విషయమై ఒక నిర్ణయానికివస్తే ఈ మంత్రివర్గమున కేమీ భంగంలేకుండా ఈనాడు చేస్తాము అని మంత్రివర్గానికి హామీ యిచ్చినటువంటివారూ, ప్రత్యేకంగానూ సాగి సూర్యనారాయణరాజుగారూ ఈ నాడు ఈ కమిటీ సూచనలను అమలుజరపడానికి ఒప్పుకుంటామని హామీనివ్వాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri L. Lakshmana Das :— అధ్యక్షా! ఈనాడు Prohibition విషయంలో చర్చసాగిస్తుంటే మనం యింత క్రిందికి దిగజారిపోతున్నామా ? అనిపిస్తోంది నాకు. ఈ త్రాగుడు అనేటటువంటిది అలవాటు అయినదంటే అది ప్రజా క్షేమమునకు తోడ్పడదు. ఈ మద్యనిషేధాన్ని తీసివేయడంవల్ల త్రాగుడు యింకా దేశంలో ఎక్కువైపోతుంది. ప్రజలంతా దానికి అలవాటుపడిపోతారు. ప్రజాక్షేమంకోసం ఈ త్రాగుడును మాన్పించవలయునని హృదయపూర్వకంగా మనవిచేస్తున్నాను. ఈ నిషేధాన్ని తీసివేస్తే ప్రజలు అభివృద్ధిలోకిరాలేరు. అసలు ఈ త్రాగుడు మంచిదికాదని చెప్పి చెప్పుకోవడం ఆనాటికాలంనుంచీ వుంది. అసలు ఈ మద్యపానం గాంధీగారి అహింసా సూత్రములకే విరుద్ధమైనది. అటువంటి మద్యపాననిషేధాన్ని గాంధీమహాత్ముని మూలసూత్ర

[Sri L. Lakshmana Das] [27th May 1954

ములలో ప్రధానమైనటువంటి అహింసాసూత్రముప్రకారం అమలుజరుపుదామంటే దానికి అడ్డుపెట్టడం జరుగుతోంది ఈ త్రాగుడును మాన్పించాలని యింతవరకు త్రాగుడు బాగా అలవాటైన పెద్ద పెద్ద దేశాలలో అమెరికా, ఇంగ్లండ్, రష్యా మిగతా యూరోపియన్ దేశములలోను, ఇంకా ఇతర పాశ్చాత్యదేశాలలోను ఈ త్రాగుడును అరికట్టడానికి ప్రయత్నించిన సంగతి మనకందరకు తెలిసియున్న విషయమే. అసలు ఇతర దేశములలో శీతోష్ణస్థితినిబట్టి, ఆయా పరిస్థితులనుబట్టి త్రాగుతారు. కాని మనదేశంలో అది త్రాగినందువల్ల అనేకరోగములు వస్తున్నాయి. ఉత్తరదేశములలోకూడా అచటి శీతోష్ణస్థితిని బట్టి అక్కడ ఈ మద్యాన్ని సేవించుతున్నారు. మనదేశం ఉష్ణదేశం అవడంవల్ల ఈ త్రాగుడువల్ల శారీరకంగాను, మానసికంగాను, నైతికంగాను అనేకనష్టాలు కల్గుతాయి. అసలు ఇదివరలో రాజగోపాలరావుగారు ఈ మద్యపానంవల్ల ఆర్థికంగాను, శారీరకంగాను, మానసికంగానూ, నైతికంగానూ మానవునికి ఎంతనష్టం కల్గుతుందో ఆ విషయాలను విశాలాంధ్ర పత్రికలో వారం వారం వ్యాసరూపంలో ప్రకటించేవారు. దానిని తిరిగి వారికి నేను జ్ఞాపకంచేస్తున్నాను.

Sri M. Hanumantha Rao:—On a point of information, Sir. విశాలాంధ్రలో యీ విషయాలను ప్రచురించలేదు; ఇతరదేశాలలో ఈ మద్యనిషేధాన్ని అమలు జరపటానికి ప్రయత్నించి, దానిలో ఏవిధంగా విఫలులైనారో ప్రచురించాము.

Sri. L. Lakshmana Das :— ఉత్తరదేశాలలో ఈమద్యపానమునకు ఎల్లప్పుడూ, ఎంతకాలంనుంచో, శీతోష్ణపరిస్థితులదృష్ట్యా అలవాటుపడిన దేశాలలోనే ఈ మద్యపానం మంచిదికాదని దీనిని నిషేధించటానికి ప్రయత్నించితే, ఉష్ణం ఎక్కువగా వున్న మనదేశంలో అనేకనష్టములు ఈ మద్యపానంవల్ల సంభవిస్తాయనే విషయమును గుర్తించకుండా మద్యపానాన్ని ఉంచాలని మీరంతా అనడం చాలా విచారకరమైన విషయము.

మనదేశంలో ఏనాడూకూడా యీ కల్లు అంగడులు పెట్టివుండలేదు. ఒక్క బ్రిటిషు ప్రభుత్వం వచ్చినతరువాత యీ దేశంలో యీ త్రాగుడు పెట్టి యీ దేశంలో ప్రజానీకాన్ని బీదరికంపాలుచేసి ప్రజల్ని పరిపాలనచేయాలనే వుద్దేశంతో త్రాగుడుపాపులు పెట్టారు. అందుకనే గాంధీమహాత్ముడు మొట్టమొదట జాతీయోద్యమం ప్రారంభించినప్పుడు ప్రారంభించినది త్రాగుడు మాన్పించాలనే వుద్యమం. ఈ నాడు opposition benches లో కూర్చున్న మిత్రులే ఆనాడు కల్లుదుకాణాలబయట పికెటింగుచేసిన సంగతి వారు జ్ఞాపకంతెచ్చుకోవాలని కోరుతున్నాను. అది success అయినదా fail అయినదా అన్నవిషయం చూస్తే కొంతవరకు fail అయినదని చెప్పక తప్పదు. Failure అయినంత మాత్రంచేత దేశంలో మరల త్రాగుడును వ్యాపింపచేస్తాం అనడం ఎంతమాత్రం ఉచితమైన భావము కాదు. దానినిగురించి తప్పించుకోదలచిన అవసరం లేదు. అది ఎట్లావున్నప్పటికీ

దొంగతనాలు యింకా జరుగుతూనే వున్నాయి, జూదరికం యింకా జరుగుతూనేవుంది, murders యింకా చేస్తూనేవున్నారు కనుక వాటికి లైసెన్సులు యిచ్చి రాబడి రాబట్టుకోడానికి ప్రయత్నం చేస్తారా అని అడుగుతున్నాను. అందుచేత మిత్రులు యిది కాంగ్రెసు వారు ప్రవేశపెట్టిందన్నభావం విడిచిపెట్టి దీనిలోని మంచిని గ్రహించి ప్రొహిబిషను విజయవంతంచేయడానికి తోడ్పడాలని హృదయపూర్వకంగా మనవిచేస్తున్నాను. 1921లో కాంగ్రెసు పికెటింగు ప్రారంభించినపుడు, యిపుడు కమ్యూనిస్టుపార్టీలో, మిగతాపార్టీలలో వున్న మీరందరూ జాతీయవుద్యమాన్ని బలపరచడానికి యిదొక ఆయుధం అనీ, బ్రిటిషు వాళ్లను వెళ్లగొట్టడానికి దేశాన్ని అభ్యుదయకరంగా ముందుకుతీసుకుపోవడానికి యీ మద్యపాననిషేధం ఒక సాధనం అనీ ఏకగ్రీవంగా అంగీకరించారు. అటువంటప్పుడు, యీనాడు శాసనసభ్యులంతా మరల ప్రజలకు త్రాగుడు అలవాటుచేద్దాం అనే కార్యక్రమం తేబోవడం మంచిది కాదు. త్రాగుడు నిషేధించడంవల్ల వచ్చిన నష్టాన్ని భర్తీచేసుకోడానికి sales tax వేసుకున్నాం. అందుచేత sales tax ను ప్రజానీకం భరిస్తున్నది. దీనివల్ల నష్టం యింకోరూపంగా భర్తీచేసుకోవాలని దేశం అభివృద్ధిని దృష్టిలోపెట్టుకుని చాల విశాలమైనదృష్టితో ఆలోచించాలని హృదయపూర్వకంగా మనవి చేస్తున్నాను. మనచేతులతో మనమే దేశాన్ని దరిద్రంతోనింపే యీ త్రాగుడు మళ్లీ దేశంలో వ్యాపించడానికి కారణం కాకూడదని మనవిచేస్తున్నాను. తరువాత మిత్రులు ప్రజానీకం దీనికి వ్యతిరేకంగా వున్నారని అంటున్నారు. మన ప్రజలలో నూటికి 50 మంది స్త్రీలేవున్నారు. ఏ ఒకస్త్రీకూడా తన భర్తగాని 'పిల్లలుగాని' త్రాగుబోతులుకావాలని కోరదు. పురుషులలోకూడా చాలమంది కాదనే చెబుతారు. అందుచేత ప్రజానీకంపేరుతో దీనిని చర్చించడం సబబైన విషయంకాదు. Ex-tappers కు పనికల్పించాలని ప్రభుత్వం నీరావిధానం తీసుకువచ్చి జపానులో చిన్న machinery తో నీరానుండి పంచదార తయారుచేస్తున్నట్లు మనంకూడా నీరానుండి పంచదార తయారుచేయించవచ్చు. ఆవిధంగా Ex-tappers కు పనికల్పించవచ్చునని మనవిచేస్తున్నాను. ఇది కేవలం కాంగ్రెసువారు ప్రతిష్టగురించి ప్రాకులాడుతున్న విషయంకాదు. దీనిని కాంగ్రెసు 1920 నుంచీ ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించిందన్నవిషయం మీ గుర్తుకు తెస్తున్నాను. అందుచేత మీ నియోజకవర్గాలకుపోయి యీ మద్యపాననిషేధం కట్టుదిట్టంగా అమలు జరపడానికి సహకరించండి. మిమ్ములను ఎన్నుకున్న మీ నియోజకవర్గప్రజలు మీ యీ కృషిలో తప్పకుండా సహకరిస్తారని నా నమ్మకం. అందుచేత మద్యపాననిషేధం విజయవంతం చేయడానికి పాటుపడాలని మీకు హృదయపూర్వకంగా మనవిచేస్తున్నాను. అందుచేత దేశం అభివృద్ధిని దృష్టిలోపెట్టుకుని, ప్రజలక్షేమం గమనించి, మీ అమూల్యసలహా లివ్వవలసిని కోరుతున్నాను. మద్యపాననిషేధం కట్టుదిట్టంగా అమలుచేయడానికి ప్రయత్నం చేయాలని కోరుతూ విరమిస్తున్నాను.

Raja Sri Sagi Suryanarayana Raju—ఉపాధ్యక్షా! సత్యనారాయణ చాపరిగారు నామీద లేనిపోని నిందను మోపారు. మొట్టమొదట ప్రభుత్వానికి వ్యతిరేకంగా vote చేస్తామని promise చేసి యిప్పుడు యేమి చేస్తారో అన్నవుద్దేశాన్ని కలవిచ్చారు. వారు కలవిచ్చినది అన్యాయం అని నేను మనవిచేస్తున్నాను. నేను మనవిచేస్తున్నదేమిటంటే మొట్టమొదటినుంచీ నేను ప్రొహిబిషనుకు వ్యతిరేకంగా మాట్లాడాను. కాని నేను ఎల్లప్పుడు ఆంధ్రరాష్ట్ర శ్రేయస్సును, ఆంధ్రప్రభుత్వ అభివృద్ధిని విశాలాంధ్ర శ్రేయస్సును కోరుతాను. విశాలాంధ్ర రావాలంటే ప్రభుత్వం వుండాలి ప్రభుత్వం ఒక step ముందుకు వేసింది. కాని తరువాత మరల ప్రభుత్వం ఒక step వెనుకకు వెళుతున్నది. అదిమాత్రం చాల విచారకరం. రామమూర్తికమిటీని ముందు ఏర్పాటుచేశారు. తరవాత యేమి చేశారంటే, స్వామి సీతారాంకోసం అయితేనేం, మరి యితరకారణాలచేత నయితేనేం, ఏ ఒత్తిడిచేత నయితేనేం సీరా యిస్తాం అన్నారు. సంజీవరెడ్డిగారు 'నేను అక్కడ లేను కనుక సీరా అంగీకరించను' అన్నారు. గోపాలరెడ్డిగారు అంగీకరించలేదు. ఈ సీరాను మొట్టమొదట తీసుకువచ్చిన కళా వెంకట్రావుగారు సీరా యిస్తే resign చేస్తానని statement యిచ్చారు. ఇలాంటి statementలు ప్రజలను ముందుకుతీసుకువెళ్లలేవని మనవిచేస్తున్నాను. కాని ఏవిధంగానైనా విశాలాంధ్ర శాంతియుతంగా సాధించడానికి ప్రభుత్వం వుండాలి కాబట్టి step by step ప్రభుత్వాన్ని దారిలోకి ప్రజలు తీసుకురావాలి. కొంతవరకు దారిలోకి వచ్చారనే నమ్ముతున్నాను. ఇదివరకు మంత్రి పట్టాభిరామారావుగారు, రాజగోపాలాచారిగారియందు దేముడిమీద వున్నంతభక్తి వుందన్నారు. రాజగోపాలాచారిగారి నూతన విద్యావిధానం తీసివేస్తున్నపుడు, మంత్రిగారు దూరం బాగా ఆలోచించి, మద్యపాననిషేధం తీసేస్తే రాజగోపాలాచారిగారిమీద ఆయనకున్న దేముడిభావం యేమీ తగ్గదు అని మనవి చేస్తున్నాను. క్రిందటిసారి ప్రభుత్వం శ్రేయస్సుకోసం ప్రభుత్వంపక్షం వోటుచేశాను. వచ్చే సమావేశంలో రామమూర్తికమిటీ చర్చకు తెస్తాం అని క్రిందటిసారి హామీయిచ్చారు. కాని దానికి ఒకరోజు కేటాయించడం దాటవేశారు. కాని నేను ఒకరోజు non-official రోజు దానికి యివ్వకపోతే resign చేస్తా నన్నాను. దానికి నా అదృష్టవశాత్తు అంగీకరించారు. అవకాశంయిచ్చారు. అందుచేత ప్రభుత్వంవారికికూడా ఒక అవకాశం యిస్తూవుండాలి. నరసింహారావుగారు మాట్లాడుతూ కాంగ్రెసు వారంతా త్రాగుతారని కలవిచ్చారు. కాని నేను కాంగ్రెసువారంతా త్రాగుతారని అనను, కొంతమంది త్రాగుతారని చెప్పవచ్చు. అందుచేత దీనిలోని మంచి చెడ్డలు విమర్శించుకొని ప్రభుత్వంవారు జాగ్రత్తగా ఆలోచించాలి. మనం చూడవలసింది ప్రభుత్వం నిలబడేమార్గం. అందుచేత మీరు దూరం ఆలోచించి మధ్యాహ్నం 3 గంటలవరకూ time వున్నది కనుక ప్రభుత్వంకూడా రామమూర్తికమిటీ ఆలోచించి కొన్ని step లు దిగేమార్గానికి వస్తే మంచిదే. లేకపోతే, మూడు గంటలవరకూ ఆలోచించి ఏది నబబైతే ఆవిధంగా చేస్తాను. (నవ్వు)

Sri Pragada Kotaiah:— అధ్యక్షా! ఇప్పటికి చాలామంది ఈ విషయాన్ని గురించి తీవ్రంగా మాట్లాడడం జరిగింది. ముఖ్యంగా మద్యపాన నిషేధం జయప్రదంగా నిర్వహింపబడుచున్నదా లేదా అనేవిషయం మీద మాట్లాడినవారికి వివాదంలేదు. జయప్రదంగా నిర్వహింప బడడంలేదనేది అందరూ అంగీకరిస్తున్నారు. జయప్రదంగా నిర్వహింపబడలేదు కాబట్టి దాన్ని రద్దుచేయాలనే భావంతో కొందరు ఏకీభవించలేక పోతున్నారు. ఎందుచేత నంటే మద్య నిషేధము లక్షలు, కోట్లకొలది ప్రజలలో ఉత్తమ సంస్కరణ ప్రవేశపెట్టుటకుద్దేశించబడింది. అయితే యెంతవరకు ఆ సంస్కరణ అమలుజరిగింది అనేప్రశ్నకు సమాధానం చెప్పటం చాలకష్టము. అందులో ముఖ్యంగా మనం మన జాతీయపోరాట సమయంలో స్వరాజ్యం కావాలని చెప్పాము. గాంధీగారు స్వరాజ్యంకాదు, స్వర్గరాజ్యం కావాలి, రామరాజ్యంకావాలని చెప్పారు. దేశంలో ప్రజలమధ్య ఆరాటం, పోరాటంలేని స్వతంత్రరాజ్యం కావాలన్నారు, స్వరాజ్యం వచ్చింది. కాని గాంధీజీ ఆశించిన స్వర్గరాజ్యం అవతరించనేలేదు. స్వరాజ్యంవచ్చి ఆరుసంవత్సరములు గడచినప్పటికి స్వర్గరాజ్యం స్థాపించలేక పోయినాము, రామరాజ్యం సాధించలేక పోయినాము. అందువల్ల మళ్లీ తెల్ల వాడిని తీసుకువచ్చిపెట్టాలంటామా? Prohibition ను విజయవంతంగా నిర్వహించలేము, కాబట్టి ప్రజలచేత త్రాగిస్తాం, అని చెప్పడం మంచిదేనా? నిరుద్యోగం మితిమీరిపోయిందంటున్నారు. Ex-tappers నిరుద్యోగులైతే దేశంలో బంజరుభూమి కావలసినంత ఉంది. దానిని వారికి పంచిపెట్టి ఆర్థికసహాయంచేసి ఉద్యోగంకల్పించాలి. ఉద్యోగంఅంటే న్యాయమైన వృత్తి క్రమమైనవృత్తిగావుండాలి. వారికి, Prohibition రద్దుచేసి, వృత్తి కల్పించాలంటే అందువల్ల దొంగసారాకాస్తున్న మరికొన్ని లక్షలమందికి ఉద్యోగం పోతుంది. ఇప్పుడు ఎక్కడపడితే అక్కడ గృహపరిశ్రమగా కల్లూసారాయికాస్తున్నారు కాబట్టి ఈ దొంగచాటుగా విపరీతంగా డబ్బుసంపాదిస్తున్న ఈమధ్యరకం ప్రజలకూ, ధనవంతులకూ వృత్తి పోతే, వారందరితరపునా మరికొందరు సత్యాగ్రహం ప్రారంభించవలసి వస్తుంది. Ex-toddy tappers తరఫునేకాదు రేపు వారితరఫునకూడా సత్యాగ్రహం ప్రారంభించాలి. వృత్తి కల్పించాలంటే పరిస్థితులనుబట్టి ఆలోచించాలిగాని, పనికిమాలినవృత్తి కల్పించడం అనేది సరియైన పంథా కాదు. అది పొరబాటు. డబ్బుకావాలంటున్నారు. Prohibition తీసివేస్తే 5, 6 కోట్లరూపాయలు వస్తాయంటున్నారు. డబ్బుకావాలంటే అనేకమార్గాలున్నాయి. నీతిలేకుండాపోతే నియమంలేకుండాపోతే వక్రమార్గా లవలంబించి ప్రభుత్వం వ్యభిచారగృహాలు బస్తీలలో పెట్టినడిపిస్తే చాలాడబ్బు వస్తుంది. కల్లుత్రాగించి డబ్బుసంపాదించనక్కర్లేదు. వ్యభిచారగృహాలు నడిపిడబ్బు సంపాదించవచ్చును. అలాంటి డబ్బుతో ప్రజలకు పురోభివృద్ధి కల్గిస్తామని చెప్పడం దేశం ఎల్లాగైనాసరే ప్రభుత్వానికిమాత్రం పన్ను ఇవ్వకుండా వుండాలని అనుకొంటున్న మధ్యరకం ప్రజలు తీసుకువస్తూయున్న ఆందోళనగాని, నోరులేని బీదప్రజానీకంకాదు యీ ఆందోళన తీసుకువస్తూయున్నది. తనమీద

[Sri Pragada Kotaiah] [27th May 1954

betterment tax పడుతుందని తెలివి తేటలుగలవారు కాబట్టి పైచేయిగాయున్న మధ్యరకం వారుచేస్తున్న ఆందోళనగాని బీదప్రజలుకాదు. ఏదైనా చాటుమాటుగా జరిగితే అది నశించుటకు అవకాశం ఉంది ప్రపంచంలో ఉన్నతమైన ఆదర్శాలు అమలుజరుపుటకు ప్రయత్నించి అనేకయుద్ధాలు జరిగాయి, ఎంతమందో మనుష్యులు చచ్చారు అందువల్ల జవహర్లాలు నెహ్రూగారు శాంతిప్రయత్నంచేయడం అనవసరమా? అనేకమంది చచ్చిపోతున్నారు కాబట్టి యుద్ధప్రయత్నాలు అవసరమనీ, శాంతిస్థాపన అనవసరమనీ ఏరాజకీయ పార్టీవారైనా చెప్పుటకు సాహసిస్తారా? ప్రపంచంలో మంచిచెడుగులు కలసి ప్రయాణం చేస్తూఉంటాయి. మంచిచెడుగును అధిగమించి పైకివచ్చుటకు ప్రయత్నంచేస్తూయుంటుంది. మహానుభావులయొక్క బోధనం సంపూర్ణంగా మంచిని సాధించుటకే వుపయోగపడుతోంటుంది. అంతా మంచే ఉంటే ఈ శాసనసభ లక్కరలేదు. ఈ పోలీసు అక్కరలేదు. పాలించేవాడు అక్కరలేదు. పాలింపబడేవాడూ అక్కర్లేదు. మహాత్మాగాంధీగారు చెప్పినట్లు ఎవరి అవసరం వారు తెలుసుకుని స్వర్గరాజ్యం అనే పేరుతో ఎవరిజీవనం వారు కల్పించుకొనుటకు వీలుంటుంది. ఈ శాసనం అమలుజరగడం లేదంటే ఈ శాసనమే కాదు, లంచగొండితనం, క్రిమినల్ ప్రొసీజరుకోడు ప్రకారం దొంగతనం, దోపిడీలు జరిగితే నేరాలంటున్నాం. నేరాలు విపరీతంగా పెరిగాయి. రెండు, మూడుసంవత్సరాలక్రితం రాజకీయపార్టీ ప్రమేయంవల్ల చాలానేరాలు జరిగినాయి. అందువల్ల, Criminal Procedure Code రద్దు చేయడానికి శాసనసభలో చట్టం ప్రవేశపెడతారా? ఎచటనైనా కొన్నిప్రత్యేకపరిస్థితులలో నేరాలుపెరుగుటకు ప్రారంభిస్తే, వాటిని అణచివేయుటకు మార్గాలాలోచించాలి. Prohibition successful గా జరుగుతోందని ఎవ్వరూచెప్పడం లేదు. చాలావఱకూ విజయవంతంకాలేదని అంగీకరిస్తున్నాం. విజయవంతం కాలేదుగదా అని, ప్రజానీకాన్నితప్పత్రాగించి మద్యపానం మరల అమలుపరుస్తామా? ఇది మధ్యరకం ప్రజలను అడ్డంపెట్టుకుని చేసే ప్రయత్నంతప్ప వేరుకాదు. ముఖ్యంగా మద్యపాననిషేధం కట్టుదిట్టంగా అమలుజరుపుటకు ప్రయత్నంచెయ్యాలి. ఉన్నతమైన లక్ష్యంకోసం అన్నిరాజకీయపార్టీలు కృషిచేస్తున్నాయి. కాంగ్రెసుపార్టీ రామరాజ్యం స్థాపించాలని ప్రయత్నంచేస్తూనేయుంది కాని అట్టి స్వర్గరాజ్యం రాలేదు. కమ్యూనిస్టులు వారి ఆదర్శరాజ్యస్థాపనకోసం 1930 నుంచీ తంటాలుపడుతున్నారు. వారు కమ్యూనిజం ఈదేశంలో స్థాపించలేకపోయినారు. అక్కడక్కడమాత్రం బలం సంపాదించారు. అందువల్ల తమ ఆదర్శాలు సాధించలేకపోయినామని చెప్పుకొనుటకు వీలులేదు. మద్యపాననిషేధం పెట్టినతరువాత మనం పురోగమించినమాట నిజమే. ఇంకను మన పురోగమనం వృద్ధిచేసుకొనుటకు సరియైన ధోరణిలో నడిస్తే, సేవచేసినవాళ్లం అవుతాము.

Sri K. Govinda Rao .— ఒకేవిషయాన్ని పదేపదే చెప్పడం జరుగుతోంది మద్యనిషేధం అనే ఆదర్శం ఉన్నతమైనదే. ఏనప్పుడు మనం ఆ ఆదర్శం సాధించడం విష

యంలో విఫలం ఐనంతమాత్రాన దాన్ని విడిచిపెట్టకూడదూ, అది సరియైనదా అని కాంగ్రెస్ సభ్యులు చెబుతున్నారు దానికి Parallel ఒకటి తీసుకువస్తున్నారు Prohibition తో దొంగతనం, వ్యభిచారం పోలుస్తే, అది విఫలమైనదని చట్టం లేకుండా చెయ్యి పెడతామా అని రాజగోపాలాచారిగారు చెప్పుచున్నారని దీని ఉదహరిస్తున్నారు. దానికి, దీనికీ fundamental గా భేదం ఉన్నది అనే విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. అది force of habit కు సంబంధించినది. దొంగతనం, వ్యభిచారం ప్రత్యేకంగా వ్యక్తులకు సంబంధించినవి కావు. సంఘానికి నష్టం కల్గించేవి. ఒక సమస్య మనసభ్యులందరూ మరచిపోతున్నారు. త్రాగుడుకు మూలకారణం ఏమిటని, దాన్ని తగ్గించుటకుమార్గం ఏమిటని scientific గా ఆలోచించకుండా, అంతాసూత్రాలు వల్లిస్తూ వాస్తవికపరిస్థితులు గమనించలేక పోతున్నారు.

ఇక్కడ ప్రధానంగా ఒకటి చెప్పబడినది. కార్మికులు బీదలు ఏరంపరుకూడ ఎందుకు త్రాగుతున్నారంటే, వారు ఆవిధముగ కాయకష్టము చేసిన పరిస్థితులలో త్రాగవలసిన అవసరం ఏర్పడుతుంది. వీరు అందువలన ఎంతమాత్రము చెడ్డవారుకారు. ముఖ్యంగా మన ప్రజానీకంలో అధిక సంఖ్యాకులుకూడ చుట్టుకుండే వాతావరణమువల్ల influence అవుతూ ఉన్నారని చెప్పారు. దురభ్యాసాల root cause ను పరిశీలనచేయకుండా దానిని అరికట్టబూనుకొన్నందువల్ల ప్రయోజనము ఉండదు. లోగడ నాగిరెడ్డిగారుచెప్పడం జరిగింది. కమ్యూనిస్టుపార్టీతరపున చెప్పుతూనేఉన్నాము. ఇది మార్గముకాదు, వాండ్ల living conditions ను అభివృద్ధిచేయండి, అంటే దానికి తుపాకులు, లాఠీలు తీసుకొని కేసులుపెట్టి జెయిళ్లకు పంపి జుల్మానాలువిధించి implement చేయడం సాధ్యంకాదు. ఇంతకుముందు లక్ష్మణదాసుగారు చెప్పారు. ఆవిధంగా ఏచట్టాన్నికూడ అమలుకుతీసుకొని రావడం సాధ్యంకాదు. ప్రధానమైనదానిలో మార్పుతీసుకొని రాకపోతే దీనిని మార్చలేరు. Smoking చెడ్డ అలవాటు. అది force of habit వల్ల వచ్చింది. దానిని విజ్ఞానంద్వారా మార్చవలెను. అవకతవక చట్టాలవల్ల ఆపటానికి ప్రయత్నించకూడదు. కోర్టులు ఉపయోగపడవు.

ఎదురుగ కూర్చుని ఉన్నసభ్యులు ఏమిచెపుతున్నారంటే, బీదవాండ్లకు దీనివల్ల ఎంతో నష్టం కలుగుతుంది. వాళ్లకడుపుకొట్టుతూ ఉన్నారని అంటున్నారు. బీదవాండ్లు వారికష్టాలు ఈనాటికైనా జ్ఞాపకమువచ్చినందుకు కొంచెము సంతోషము. ఈ సేల్సుటాక్సు అంటే సామాన్యప్రజలమీదనే వేస్తున్నారు. వాటిని consumers భరిస్తున్నారు. వర్తకులమీద కోటీశ్వరులమీద వేయడంలేదు. ఊరికే బీదవాండ్లమీద ప్రేమ ఒలికించడంవల్ల ప్రయోజనం లేదు. ఇప్పుడు పూర్వంకన్నా దొంగసారాయి ఎక్కువఖరీదు అవుతుంది. స్త్రీలు బాగుపడుతున్నారు గదా అని అంటారు లక్ష్మణదాసుగారు. పూర్వముత్రాగని స్త్రీలుకూడా ఇప్పుడు త్రాగుటకు అలవాటుపడి ఉన్నారు. విశాఖ, శ్రీకాకుళంజిల్లాలలో స్త్రీలుకూడా త్రాగుతున్నారని తెలుస్తుంది.

Sri K Lakshmana Das శ్రీకాకుళంజిల్లాస్త్రీలు త్రాగుతు: అక్కడ త్రాగుడుచా ... ... పెద్దగానవలెనని చెప్పుతున్నాను.

Sri K Govinda Rao — లక్ష్మణదాసుగారు ఒక్కొక్కప్పుడు విశాఖ పట్టణం Champion అవుతారు మరొకప్పుడు శ్రీకాకుళం Champion అవుతారు. ఉపాధ్యక్షా, నాఆఖరువిన్నపం ఏమంటే, ముఖ్యంగా ప్రజాపార్టీలో వున్నవారు గమనించ వలసిన అవసరం ఉంది. లోగడ రామకృష్ణారెడ్డిగారు ఈసారి తప్పక మద్యనిషేధంరద్దుకు నిలబడతామని చెప్పారు. అది మర్చిపోవద్దని మనవిచేస్తున్నాను ప్రజలలో తిరిగి మనము చెప్పుకోవలసిన అవసరం ఉంటుందని గమనించాలి. మనమాటలకు విలువఅనేది ఉంటే ఈ విషయంలో కమిటీరిపోర్టును ఆమోదించుటకు అంగీకరించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri V V Krishnama Raja Bahadur — ఉపాధ్యక్షా, ఇదివరకు అనేకదఫాలు దీర్ఘంగా చర్చించాము. అయినప్పటికి తిరిగి చర్చకు రావడం గవర్నమెంటు వారు ఇచ్చిన హామీవల్ల ఈవిషయంలో నాకుముందు మాట్లాడినమిత్రులు అనేకరీతులలో అనేకభావములను వెల్లడిచేశారు. నేను ప్రప్రథమములో మనయొక్క భారతదేశానికి Propaganda చేసిన పరిస్థితులలో ఇది ముఖ్యమైన fundamental right అని అను కొన్నాను. అదేగాంధీగారి ఆశయం దానిని ఏవిధముగ నిర్వహణచేయవలెనో ఆలోచిం చారు. గాని ప్రస్తుత పరిస్థితులలో మనదేశదారిద్ర్య దృష్ట్యా, ఇది ఎంతవరకు అమలుజరిగింది అమలుచేయగలమా అను విషయములనుగురించి చర్చ జరిగింది. గాని ప్రప్రథమ ములో ఇది ఆచరణలో ఉన్నదాలేదా అనే అభిప్రాయభేదములు వచ్చాయి. నేను కోరేది ఏమంటే మనమంతాకలసి Prohibition ను అమలుచేయడానికి సహకరించవలెను. మానవసమాజములో ప్రకృతిసిద్ధముగ మద్యపానము ఉంది అని పురాణములో ఉంది. సారా మానవ సమాజానికి ఉపయోగంగా ఉంటుంది. తాటి, ఈత, కొబ్బెర అమృతప్రాయంగా పని చేస్తుంది. కొన్నివ్యాధులు నీరాపుచ్చుకుంటే తగ్గుతాయి. దానికి food value కూడ ఉన్న దన్నారు. బీదప్రజలనుండి అందరూ సహకరించవలెనని చెప్పుతున్నాను. అందుచేత లక్ష్మీనర సింహందొరగారుపెట్టిన amendment ఆచరణీయంగా ఉంది. దానిని యోచిస్తే బాగా ఉంటుంది.

Sri M. V. Subba Reddi :—ఇంతవరకు మాట్లాడిన సభ్యులలో మద్యపాన నిషేధం ఏవిధంగా సంపూర్ణంగా విఫలత్వం పొందినదీ అన్నసంగతిని గురించి చెప్పారు. స్త్రీలు మద్యపాననిషేధం రద్దు చేయగూడదంటారని ఘంటాపథంగా మంత్రిగారు చెప్పినప్పటికీ, ఎక్కువ మహిళలుదానికి వ్యతిరేకంగా, మద్యపాననిషేధం పూర్తిగా విఫలమైనదనీ దానిని త్వరగా రద్దుచేస్తే బాగుంటుందని చెప్పారు. ప్రత్యేకంగా, గ్రామసీమలవెంట వెళ్లితే మన కళ్లకు కనిపిస్తుంది. నూటికి, నూరుపాళ్లు ఈ మద్యపానం నిషేధం విఫలమైందని ప్రభుత్వం

ప్రవేశపెట్టిన యీ మద్యపాననిషేధం ద్వారా ఎంతో [illegible] అనేకరకాలుగా యీ త్రాగుడు ప్రజలలో వ్యాపించినదని కష్టపడేటపుడే కనిపిస్తుంది. ఈ విషయంలో చూడడానికి, ప్రభుత్వమునకు కళ్లు లేవేమో ప్రజలు చేసే చెవులు లేవేమో అని అనిపిస్తుంది. మద్యపానం వల్ల [illegible] పోయినవారిని గురించి ప్రభుత్వం ఆలోచించలేదు. వారంతా సత్యాగ్రహమే శరణ్యం అయింది ex-tappers ను గురించి, ఆలోచించడానికి ప్రభుత్వమునకు హృదయం లేదు అని చెప్పవలసివుంది. ఈ ప్రభుత్వం వచ్చిన గండములో నుంచి తప్పుకోడానికిగాను, స్వామి సీతారాంగారిని బ్రతికించడానికని చెప్పుతూ, నీరాను తీసుకొని వచ్చారు. దీనిని ఆధారంగా చేసుకొని, బడ్జెట్టు సమావేశములో స్వతంత్రసభ్యులను, కలుపుకొని Excise Demand ను నెగ్గించుకున్నారు. ఓడిపోతే ప్రభుత్వం రాజీనామా యివ్వవలసిన అగత్య ఏర్పడివుండేది. ఇప్పుడైనా దీనిని Non-Official రోజున చర్చకు తీసుకొనివచ్చారు. ఈ చర్చలో యిది నెగ్గితే శిఫార్సుగా తీసుకుంటామని చెబుతారు. రూల్సు నీతిని, నియమాలను పాటించడానికిగాని, విలాసంకోసం చేయబడలేదు. నిబంధనలను అడుగడుగున ఉల్లంఘించటము జరిగితే పతనము తప్పదు.

ఇప్పుడు మద్యపాననిషేధంవల్ల వృత్తులు పోయినవారు, వారికి వేరే శరణ్యంలేక, శాంతియుతంగా సత్యాగ్రహానికి పూనుకున్నారు. గాంధీమహాత్ముడు చెప్పినవిధంగానే శాంతియుతపద్ధతుల ద్వారా వారికి జీవనోపాధిని చూపించమని కోరుతూ సత్యాగ్రహం చేస్తున్నారు. కాని వారిని ప్రభుత్వం నిర్బంధించింది. వెంటనే ఆ సత్యాగ్రహులనందరినీ విడుదల చేయవలయునని కోరుతున్నాను. వాళ్ల అందరి జీవితాలను కాళ్లతన్నిపారవేసిన ప్రభుత్వం-వెంటనే గుర్తించి, వారందరికీ నష్టపరిహారం యివ్వవలెనని కోరుతున్నాను. వీరందరి జీవితవిధానాలను ఒక్కకలంపోటుతో నాశనముచేస్తున్న, ఈ ప్రభుత్వం వీరి కష్టములను గుర్తించటానికి ప్రయత్నించటం లేదు. వెంటనే, ప్రభుత్వం, ఈ సత్యాగ్రహులను రాజకీయబాధితులుగా గుర్తించాలని చెబుతున్నాను. ప్రభుత్వం ఎక్స్-మిలిటరీ వాళ్లకు బంజరుభూములను యిచ్చి జీవనోపాధిని కల్పించటము లేదా ? ప్రభుత్వం ఈ మాజీకల్లుగీతపనివారి విషయంలోగూడ సానుభూతి చూపి రాజకీయ బాధితులుగా గుర్తించాలని కోరుతున్నాను. ప్రభుత్వం, ప్రజలకు తిండి, గుడ్డ కల్పించాలి లేకపోతే ఆ ప్రభుత్వం సంపూర్ణంగా విఫలత్వం పొందుతుంది. ఈ ప్రభుత్వం గాంధీయ సిద్ధాంతాలను, భూతాలు వేదాలువల్లించినట్లు వల్లించి కాంగ్రెసును బ్రతికించుకోవాలని ప్రయత్నాలు చేస్తున్నారు.

వెంటనే కల్లుగీతపనివారియొక్క కోర్కెలను ప్రభుత్వం సానుభూతితో విచారించి, వారికి వెంటనే జీవనభృతిని కల్పించాలని కోరుతూ రామమూర్తి కమిటీవారి శిఫార్సులను పాటించాలని కోరుచున్నాను.

**The House adjourned for Lunch.**

## After Lunch 3 P. M.

The Bell was rung for want of quorum

Sri T. Nagi Reddi.— Is it for the Ministers to come or for the quorum of the members.

Mr. Speaker :— It may be either.

Sri C. V. K. Rao·— What a challenging attitude.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— He knows pretty well. That is one thing lacking in me.

Mr. Speaker :— On the point of order raised by Sri K. Varadachari, I give my ruling now :

Sri K. Varadachari raised a point of order, that the amendments relating to the resolution regarding the scrapping of the Prohibition Act offend against the Directive Principles of the Constitution and are therefore not admissible. The Hon. Sri T. Visvanatham, Minister for Law says that in his opinion the amendments are not inadmissible and that the House is competent to consider them. I agree with the opinion of the Law Minister and hold that the amendments are in order. The point of order is therefore ruled out of order.

Sri N. V Rama Rao :— అధ్యక్షా! న్యాయశాఖామంత్రిగారు చెప్పలేదని విశ్వనాథంగారు చెప్పుతున్నారు. Law Minister అభిప్రాయం ఒప్పుకొంటున్నాను.

అధ్యక్షా! ఈ మద్యపాననిషేధ విధానంగురించి మనము మద్రాసుశాసనసభలో అనేక పర్యాయములు తర్జనభర్జనలు చేసుకొన్నాము. ఇది fail అయిందని, అమలుజరుగుట లేదని శాసనసభ్యులందరు ఒప్పుకొంటున్న విషయమే. ప్రస్తుతం మన ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న శ్రీ విశ్వనాథంగారు ఆరోజున మద్రాసుశాసనసభలో ప్రతిపక్షనాయకులుగా ఉండి మద్యపాన నిషేధంగురించి ఇచ్చిన గంభీరఉపన్యాసములు నిన్న ఈవేళ చాలా విమర్శన దృష్టితో చదివాము. అవి చాలా అద్భుతంగా ఉన్నవి. కాని వారు ఇప్పుడు ఏమి చెప్పు తున్నారు? ఇంకా వారి అభిప్రాయం తెలియలేదు. తరువాత ఇప్పుడు Agricultural Minister గా వున్నటువంటి తిమ్మారెడ్డిగారు మద్యపాననిషేధము ఏవిధంగా fail అయిందో దాన్నిగురించి ఆవేళ చాలాగట్టిగా మాట్లాడారు. ప్రస్తుతప్రభుత్వాన్ని బలపర

స్తున్న independent శాసనసభ్యులుకూడ చాలామంది ఆవేళ మద్యపాననిషేధాన్ని రద్దు చేయాలని చాలా ఖచ్చితమాగా చెప్పినారు. తరువాత రామమూర్తికమిటీ వారికి పంపించిన సమాధానాలలో, ఒక మిత్రుడుచెప్పినట్లు, ఒకరెద్దరుతప్పితే, తక్కినవారు దీనిని రద్దు చేయవలసిందనే ఒప్పుకొన్నవారు ముఖ్యంగా Congress సభ్యులైనటువంటి వేమారెడ్డిగారు, సుబ్రహ్మణ్యంగారు, తమ్మా కోటమ్మరెడ్డిగారు ఇది utter గా fail అయిందని, ఈ విధంగానే దీనిని continue చేస్తే మంచికంటె చెడ్డే ఎక్కువ కలుగుతుందని ఆ కమిటీకి సమాధానం పంపించారు. స్త్రీసభ్యులైన కోటమ్మరెడ్డిగారే దీనిని చాలా వ్యతిరేకిస్తూ మద్యపాన నిషేధాన్ని రద్దుచేయవలసిందని గట్టిగా చెప్పారు. అనేక స్త్రీసంఘాలుకూడ ఆవిధంగా రిపోర్టుచేశాయని report లో ఉన్నది. అందుచేత ప్రజానీకంలో నూటికి 99మంది మద్యపాన నిషేధవిధానాన్ని రద్దుచేయాలని అనుకొంటున్నారు. బయట ప్రజలుకూడ అదేవిధంగా అభిప్రాయపడుతున్నారు. ప్రభుత్వ ఉద్దేశ్యంకూడ అంతేకాని వైకిచెప్పకోరు. ఈప్రభుత్వము తమంతటతామే రామమూర్తికమిటీని ఎందుకువేసిందని ఆలోచించినట్లయితే ఆవిషయం రుజువౌతుంది. ప్రస్తుతం ఆర్థికశాఖా, న్యాయశాఖామంత్రులుగా ఉన్నటువంటి విశ్వనాథంగారు ఒకానొకప్పుడు మద్రాసుశాసనసభలో ప్రతిపక్షనాయకులుగా ఉండి గవర్నమెంటువారి Excise Demand మీద cut motion move చేస్తూ ఈ మద్యపాననిషేధవిధానము రద్దుచేయాలని, ఇది మేలుకంటె చెడ్డే ఎక్కువచేసిందని, గనుక దీనిని పరిశీలించుటకు ప్రత్యేకంగా ఒక expert కమిటీఅయినా వేయాలని అన్నారు. అప్పుడు రాజగోపాలాచారిగారు నేను ఏవిధంగానైనా యీవిధానాన్ని continue చేయదలచుకొన్నాను, దీనిలో తప్పులేదని తెలిసినప్పుడు కమిటీవేయవలసిన అవసరంలేదని కమిటీవేయుటకు నిరాకరించారు. రాజగోపాలాచారిగారు కమిటీనివేయ నిరాకరించగా ఆంధ్రప్రభుత్వం తమంతటతామే ఈ కమిటీని వేశారంటే, మద్యపాననిషేధవిధానం fail అయిందని ఇది అమలుజరగడం లేదని దీనివల్ల ప్రజలలోఎక్కువ అసంతృప్తియున్నదని వారు తెలుసుకొనే, దీని రద్దు తమంతటతామే చేస్తే బాగుండదని ఒకకమిటీద్వారా ఏర్పాటు చేయిస్తే బాగుంటుందనే ఉద్దేశ్యంతో రామమూర్తికమిటీని నియమించి వుంటారు. ఈకమిటీనివేసిన అభిప్రాయమే మీటో ప్రొహిబిషనుమంత్రి పట్టాభిరామరావుగారు నాతో పైవిధముగనే చెప్పారు. నాతోనేకాకుండా, ప్రతిపక్షనాయకులు నాగిరెడ్డిగారితోగూడ చెప్పినట్లు యీవేళ చెప్పారు.

The Hon. Sri S. B. P Pattabhirama Rao :— అధ్యక్షా! అదిచాలా పొరబాటు అభిప్రాయమని, అసత్యమని అంటున్నాను.

Sri N. V. Rama Rao :— అది అసత్యం అని మంత్రిగారు చెబుతున్నారు. వారుఅన్న మాటమీద నిలబడలేదని నాకు తెలుసు, మీకందరికి తెలుసు, అందులో వారు నిల

[Sri N. V. Rama Rao] [27th May 1954

బడతారో లేదోకూడా నాకుబాగా తెలును. ఇక్కడ ప్రజలకు బయటవున్న ప్రజలకుకూడా తెలుసు. నేను చెప్పేది నన్నునమ్మేవారు నన్నునమ్ముతారు. వారిని నమ్మేవారువారిని నమ్ముతారు. అంతేగాని నేను dispute చేయడములేదు. వారుఆవిధంగా అన్నారని చెబుతాను.

Sri N V. L Narasimha Rao —ఉపాధ్యక్షా ! ఇంతవరకు యిద్దరిపేర్లను మీరుపిలవగా వారు యిక్కడలేరు. వారు రాలేదని అనుకుంటాను. గనుక రానివారికిగాను నియమించబడ్డ టైముకూడా రామారావుగారికే సంక్రమించుతుందా !

Mr Deputy Speaker — I have distributed the time on the basis of party affiliation.

Sri N V Rama Rao — అందువల్ల కమిటీనివేసినతరువాత కొన్నిరోజులకు ఆకమిటీవిషయములలో సంజీవరెడ్డిగారు అడ్డము పెట్టడముతో కథ అంతా అడ్డముతిరిగింది. అందువల్ల యీతీర్మానంవచ్చిందనుకుంటున్నాను.

Sri B Krishnamurthi Rao .— ఉపాధ్యక్షా ! మద్యనిషేధమును రద్దు చేయడమును గురించినచర్చలలో పాల్గొన్నవారందరు. పార్టీప్రణాళిక నమలుపరుచవలెననియో మరే యితరకారణములచేతనోగాని, యీ నిషేధమును రద్దుచేయమని కోరుతున్నారు. అయితే నా అభిప్రాయములో వారు పరోక్షముగా మద్యమును సేవించడము, త్రాగడము నైతికంగా మంచిదికాదని చెబుతూ, ప్రత్యక్షంగా యిది రద్దుచేయమని చెప్పుతున్నారని అనుకుంటున్నాను. అంటే త్రాగడముమంచిదే, నిషేధమును రద్దుచేయమని చెబుతున్నారు. రామమూర్తికమిటీవారు ఆలోచించిచేసిన నిర్ణయము అంతాగూడా అమలుజరపటానికి వీలుకాదు అనే దృక్పథముతో పరిశీలించిచూస్తే, యిందులో ఒకవిషయము బయటపడుచున్నది. కమిటీవారు విచారణచేయుటలో ఒకేపక్షమునకు సంబంధించినవారు, నిషేధమును తీసివేయాలన్న వారినుంచే యెక్కువగా నివేదికలువచ్చాయి. కమిటీ వారికి నివేదికలు అందజేసినవారిలో ఎక్కువమంది అంటే Prohibition రద్దుచేయాలని రాజకీయంగా నినాదాలు లేవదీసినవారు, Ex-Tapppers లో నిరుద్యోగులైనవారు, పూర్వము కంట్రాక్టుచేసి, యీ నిషేధమువల్ల కంట్రాక్టు పోగొట్టుకొన్నవారు, యింకను యితరస్వార్థపరులు ఆ నివేదికలు యిచ్చారుగానీ, నిజంగా దీన్ని తీసివేయమని చెప్పేవారు చాలా తక్కువ అని నా అభిప్రాయము. ఇదంతా ఆలోచించిచూస్తే, దీన్ని పూర్తిగా వ్యతిరేకించేవారు ఎవరంటే Ex-Tappers దీన్ని ప్రబలంగా బలపరుస్తున్నారు. ఇది Ex-Tappers యొక్క నిరుద్యోగసమస్యవల్లనే అంటున్నాను. దీనికి యింకను అనేక కారణము లున్నవి. ముఖ్యంగా ప్రతిపక్షసభ్యులు ప్రజలవద్దకు వెళ్లినప్పుడు మద్యనిషేధము తీసివేయిస్తామని నినాదాలు చేస్తున్నారు. అయితే నేనొక విషయముమాత్రము చెబుతున్నాను. నైతికంగా దీనికి కాంగ్రెసుపార్టీపెద్దలు యీ నిషేధము తొలగించటానికి బాధ్యత

వహించారు. ప్రభుత్వపక్షమువారు సారాఅంగళ్లు రద్దుచేస్తామని అంటే, ప్రతిపక్షసభ్యులు అంగళ్లు మరల పెట్టిస్తామని అంటూవుంటారు. ఈ విధమైన నినాదాలతో ప్రతిపక్షసభ్యులు ఎన్నికలలో గెలవటానికి వీలుకలిగిందని శ్రీ రాజగోపాలరావుగారికి హెచ్చరికచేస్తున్నాను. కాంగ్రెసుపార్టీవారు నైతికంగా వారిపార్టీ నిబంధనలకు కట్టుబడి వుంటున్నారు.

ఒకప్పుడు మద్యనిషేధము తెచ్చిపెట్టిన పార్టీవారు యీ నాడు తీసివేయబోరని నమ్మాలి అది కాంగ్రెసుపార్టీవారి కనీసధర్మము. 1937 వ సంవత్సరములో Prohibition యాక్టు అమలులోకి వచ్చింది. ఇది సరిగా అమలుజరగ లేనుకాబట్టి దీన్ని అమలుజరపాలనేగాని, దీన్ని రద్దుచేయమని ఎవరు అనరు. ఆవిధంగా చూస్తే, అమలుజరుగని యాక్టులు అన్నియు రద్దుచేయాలని ఎక్కడవున్నది? దేశములో అమలులోకి తెచ్చిపెట్టిన బహుభార్యాచట్టము అమలుజరగలేదంటే, దాన్ని రద్దుచేస్తామని చెబితే బాగుంటుంది. ఉరిశిక్షలు అమలుజరపడములేదు కాబట్టి, అది ఎత్తివేయవలసిందేనా? బహుశ ప్రతిపక్షసభ్యులకు ఆవిధమైన దృక్పథము వుంటుందేమోగాని, ప్రభుత్వపక్షములోని వారికి ఏవిధంగాను వుండదని నమ్మమంటున్నాను. ప్రభుత్వోద్యోగస్థులలో లంచగొండితనము ఎవరివల్ల వచ్చిందో ఆలోచించాలి. ఎన్నికలలో శాసనసభ్యులుగా వచ్చినవారు సాధారణముగా లక్షరూపాయలకుపైగా ఖర్చుపెట్టారు. కూలినాలి చేసుకునేవారు నాలుగు అణాలు కల్లుకు సారాయికి ఖర్చుచేస్తే, యిక వారిజీవనము వెళ్లబోసేది ఏవిధంగా వుండగలదో గుర్తించినట్లు లేదు. మద్యనిషేధము యింతకాలంగా వుండబట్టియే, పేదప్రజలు యీ కొద్దిపాటి సుఖముతోనైనను జీవించగలుగుతున్నారు. మద్యనిషేధము రద్దుచేయడమంటే, కూలిచేసుకునే పేదప్రజానీకం, వారికి వచ్చేదానిలో కొంత ఖర్చుపెట్టటమవుతుందనేది సభ్యులు గుర్తించాలి. మద్యపాననిషేధచట్టము అమలుజరగడము కష్టసాధ్యమయిందని మేము ఒప్పుకోము. 1939 వ సంవత్సరములో Prohibition కొత్తగా అమలులోకి రాకముందు, ఆతరువాత, వున్నతేడా ముఖ్యంగా గమనించవలసియున్నది. గారపాటి సత్యనారాయణగారు మద్యనిషేధమునుగురించి ఎంతో చక్కగా చెప్పారు. శ్రీ N V L Narasimha Rao గారిని గుంటూరు నరసింహారావుగారు అని ఒక సభ్యుడు అన్నప్పుడు నేను గుంటూరు నరసింహారావును కాదని అన్నారు. వీరు బహుశ గుంటూరునుంచి వచ్చారుగనక, ఆవిధంగా పిలిచివుండవచ్చును. బహుశ వీరుకూడ 1939 వ సంవత్సరంలో శాసనసభ్యులుగా వుండివుంటారని అనుకుంటాను. వీరుకూడ అప్పుడు కాంగ్రెసులో వుండివుంటారు. ఆనాడు వారు యీ మద్యనిషేధానికి తలవూచి వుంటారని నా అభిప్రాయము. కాని యీనాడు దాన్ని తీసివేయండి అనడము ఆశ్చర్యకరముగావుంది.

శ్రీ R. Lakshminarasimham Dora గారు ex-tappers ను గురించి చెప్పారు. వారికి వేరేవుద్యోగాలు యిచ్చినట్లయితే, Prohibition తీసివేయటానికి యింత ఆందోళన వుండదని అనుకుంటాను.

[Sri B. Krishnamurthi Rao] [27th May 1954

టైము చాలా కొద్దిగావుంది కాబట్టి నేను త్వరలోనే ముగించదలచాను.

ఈ నాడు మద్యనిషేధము రద్దుచేయాలనేవారు రకరకాలుగా మాట్లాడుతున్నారు. వీరు యీ విధంగా మాట్లాడడమనేది, వారికి స్వతహాగా వుద్దేశించిన అభిప్రాయముకాదని నా దృఢనమ్మకము. Ex-tappers కు వుద్యోగవృత్తులు కల్పించని కారణంగా Prohibition కు వ్యతిరేకత ఏర్పడింది ఇందులో ఎవరిదృక్పథము వారిదిగా కనబడు తున్నది. కాని ప్రతిపక్షసభ్యుల దృక్పథంతో నేను ఏకీభవించజాలను. చట్టము పూర్తిగా అమలుజరపాలనే నా అభిప్రాయము. Ramamurthi committee report one-sided గా వుంది కాబట్టి దీనిలోవున్న కష్టసుఖాలు, సాధక బాధకాలు పరిశీలించనిదే, దీన్ని అమలులోకి తేవడం అంత సమంజసముకాదు. కాబట్టి లక్ష్మీనరసింహందొరగారు తెచ్చిన సవరణను నేను బలపరుస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri C. Subbarayudu :— అధ్యక్షా ! ఉదయంనుంచికూడా యీరోజు ఒక ఆంధ్రదేశానికే కాకుండా యావద్భారతదేశానికికూడా పరిణామాలు తెచ్చిపెట్టే విషయాలను గురించి మనం ఆలోచిస్తున్నామనే విషయం శాసనసభ్యులందరి మనస్సుల్లో పెట్టుకోవాలని నేను మనవిచేస్తున్నాను. ఈ మద్యపాననిషేధము మంచిదని అందరూ చెబుతున్నారు. అయితే ఆచరణలో ఆచట్టాన్ని సక్రమంగా అమలుజరుపటంలేదు. కనుక దానిని తీసివేయటం మంచిదని మనమిత్రులు చాలమంది చెబుతున్నారు. అయితే, యీ కమిటీని (Ramamurthy Enquiry Committee) వేయటంలో ప్రభుత్వానిదే చాల ఘోరపాటు, తప్పిదము వున్నదని నేను చెబుతున్నాను. ఇది హృదయానికి సంబంధించిన సమస్య. అటువంటిదానిని సరియైనపరిస్థితులలో అనుచితమైనకాలములో వారు విచారణచేయ వలసి వున్నప్పుడు, దానికి నిపుణులను వేయటం ధర్మము ఆ విధంగా కమిటీనివేయటం ప్రభుత్వకర్తవ్యము. ఆ కర్తవ్యమును నెరవేర్చుటకు ప్రభుత్వము తలపెట్టలేదు. ఈ నిపుణులు అన్నిరంగాలలో ఆరితేరినవారు అయినప్పటికి యిటువంటి సాంఘికచట్టమును పరిశీలించుటకు వారు యేమాత్రమూ అర్హులుకారని నా అభిప్రాయము. ఇంత తెలివితేటలుగలిగిన వారికన్న, హృదయపూర్వకంగా సహాకరించుటయే ప్రధానధర్మమని యెంచివున్న వ్యక్తులు, దీనిలోతుపాతులకుపోయి, దీనికి కావలసిన భోగట్టాను శాసనసభ్యులముందు పెడితే, వాళ్లు నిష్కర్షగా దానిని సవరించే అవకాశాలు వున్నాయి దీనిని నిర్ణయించుటకుగల అవకాశాలు మానవాతీతమైనప్పుడు, దీనియొక్క ఫలితాలు యేమిటి అని ఆలోచించ వీలుంటుంది. మనం రాజకీయంగా యే పార్టీకిచెందిననుకూడా, మనం మానవులము కనుక మనం అట్టి మానవ దృక్పథంతో ఒక్క క్షణం రాజకీయపార్టీలను ప్రక్కను పెట్టిచూస్తే, మద్యనిషేధమువల్ల ప్రజలు యెంతవరకు నైతికంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ లాభమును పొందగల్గుదురో, అర్థము అవుతుంది. దురదృష్టవశాత్తు నేను అటువంటి ఆ కుటుంబానికి చెందినవాడిని గనుక, దీనియొక్క ఫలితాలను అనుభవించినవాడిని కాబట్టి, ఆవిధంగా కుటుంబాలు యెన్నో పాడయిపోయినాయి కాబట్టి యెన్నో సంసారాలు

ఆర్థికసాంఘిక దౌర్బల్యానికి గురికావలసి వచ్చినాయి కాబట్టి, అటువంటి కుటుంబాలలో పుట్టినవారము కాబట్టి, ఆవిధంగా జన్మించడంవల్ల మేముకూడా సంఘంల్లో గౌరవంగా ఆర్థికంగా ముందుకు రావడానికి అవకాశాలు వుంటాయనే దృష్టితోనే నేనొక్కడనే కాకుండా, మీరంతాకూడా ఆలోచించవలసినదని, ఆవిధంగా వాస్తవిక దృష్టితోనే చూడవలసినదని మిమ్ములను ప్రార్థిస్తున్నాను. రామమూర్తి కమిటీవారు చేసిన సిఫార్సులు యేమిటి? వారు యే విధంగా యెక్కడెక్కడ, యెంతకాలంలో విషయసేకరణచేశారు యివన్నీ ఆలోచించండి. గ్రామగ్రామాలకు పోయి యెక్కడైతే యీ ప్రొహిబిషను చట్టమును వుల్లంఘన చేస్తున్నారో, అక్కడకుపోయి, అక్కడవారి మధ్యవుండి, అంటే అటువంటి గ్రామాలకుపోయి, Prohibition పెట్టకముందు యెంతమంది త్రాగుతున్నారో, యీ రోజున యెంతమంది త్రాగుతున్నారో లెక్కలువేస్తే, మనమంతా సమగ్రంగా ఆలోచించడానికి వీలంటుంది. అందుచేత మీరు దీనిమీద ఇంకను నిర్ణయముచేయకముందు హృదయముపై చేయివేసుకొని ఆలోచించి, పిమ్మట గ్రామాలకుపోయి అటువంటి లెక్కలు వేసి, నిజంగా యీ చట్టంవల్ల త్రాగుడు యెక్కువ ఆయినదని, నిరూపణచేసి అప్పుడు దీనిని మార్చివేయమని మీరు చెప్పటంలో అర్థంవున్నది. నా అనుభవంలో నేను Prohibition కు అనుగుణంగా కృషిచేసినవాడను గనుక, నేను సవాలుచేసి చెప్పుతున్నాను. Prohibition Act అమలులోపెట్టి, త్రాగేవారిపై కేసులుపెట్టటంవల్ల వేలాదిప్రజలు బాగుపడ్డారని చెబుతున్నాను. ఈనాడు మధ్యతరగతులవారు దొంగ సారాయిని తయారు చేయుటకు అలవాటుపడినవారైయ్యారు ఆవిధంగా మధ్యతరగతివారు దొంగసారాయిని తయారుచేయుటకు అవకాశము కల్పించుకొని, మద్యపాననిషేధమునకు అప్రతిష్ఠ తెస్తున్నారు. అదేప్రకారముగా ప్రభుత్వము దృఢమైన నమ్మకముతో విశ్వాసముతో నిర్వహించిన కారణంచేత, ఫలితాలను పొందుతున్నారు. ప్రభుత్వపుపెద్దలు సేలంపోయి పరీక్షచేసినప్పుడు, నూటికి 70 మంది దీనికి అలవాటైయున్నారని లెక్కవేశారు. నైతికంగా, వ్యక్తిగతంగా, ఆ దౌర్బల్యాన్ని వదలి మానవసేవచేయండి అందుకు ఆదృక్పథంతో యేమి చేసినా మాకు సంతోషమే. ఆర్థిక దృక్పథంతో, ఆలోచించినాకూడా రైతు ఖర్చుచేసే దానిలో యే ఒక్కఅణా మిగల్చకలిగినా, వారి ఆదాయమును పెంచినవారమవుతాము. ఎక్కువటైములేదు కాబట్టి యింతటితో విరమిస్తున్నాను.

The Hon. Sri T. Prakasam :— నేను ఒక చిన్న statement చేయదల్చాను. మంచి తీవ్రమైన వాదనలు వుండేటప్పుడు, పెద్దపెద్ద speeches చేస్తూవుండే time లో నేను చెప్పదలచే సంగతి కొద్దికొద్దిగా చెప్పి, తరువాత యింకొకసారి పూర్తిచేయాలని అనుకొంటున్నాను. మరేమీలేదు. నీరానుగురించి యింతపెద్దవాదనలు ప్రతివాదనలు చేస్తున్నారు. నీరా ఒకటి, రెండు నెలలు కావడంతోటే కల్లు అవుతుందని, అట్లాచెప్పే statements సరియైనవి కావని, తరువాత రెండునెలలు కాదు కదా, ఆరునెలలపాటు వుండే అవకాశం వుందని పరీక్షచేసి నాకు 2 నీరాబుడ్లు, 3 పాలబుడ్లు పంపారు. ఆ

ఉత్తరం మాత్రమే వచ్చిందికాని, ఆ నీరాబుడ్లు, పాలబుడ్లు యింకారాలేదు రేపు వస్తాయేమోనని అనుకొంటున్నాను. ఈ నీరాబుడ్లు సంగతి చాల పెద్దచరిత్ర. అది సామాన్యమైన చరిత్రకాదు. ఇప్పుడు, యిక్కడ యింత పెద్ద యోధులు challenge చేసుకొని వాదోపవాదాలు చేస్తూన్నపుడు, యీ సంగతి నేను చెప్తున్నాను. చివరరోజులలో యిక్కడనుంచి United States of America కు కూడా యీ నీరా, పాలబుడ్లను యెగుమతి చేశారు. వారు అట్లా యెగుమతి చేసినటువంటి వాటిలో 3 నీరాబుడ్లు, 3 పాలబుడ్లు నాకు పంపారు. అవి నా పేరుమీద వచ్చివున్నాయి. తిండిలేక, కూలిలేక పాటుబడేవారికి యీ నీరామూలంగా యేవిధంగా ఎంత ఆహారపదార్థం లభ్యం అవుతుందో అందులో వ్రాయబడివున్నది. ఈ మాటచెప్పి మీ తీవ్రవాదనలలో మిమ్ములను అటకాయించినందులకు నన్ను క్షమించండి. అవి శ్రీ నాగిరెడ్డిగారిచేతుల్లో పెడతాము. వాటిని వారు పరీక్షచేయవచ్చు. ఎవరెవరు వాదిస్తున్నారో వారంతా కూడా పరీక్షచేయవలసిన time వచ్చింది. అందులోనూ 27 వ తేదీ యింత పెద్ద ముహూర్తము పెట్టుకొన్న time లో నేను చెబితే బాగుండదని అనుకొన్నాను. వారు అందులో అన్నిసంగతులు చెప్పారు. వారు చెప్పిన ప్రకారంగా చేస్తే ఎవరైతే పనిలేకుండా వున్నారో వారి నిరుద్యోగం యీ నీరాద్వారా పోతుందని, దీనిమీద వ్రాసివున్నది. ఇది కొంచెము పెద్ద ఉత్తరము.

ఇది మీముందు పెడితే కొంచెం time తీసుకుంటుందేమో అని ఇక్కడ చదవలేదు. దానిలో ఈ నీరాబుడ్లు, ఈ పాలబుడ్లుగురించి వారు వ్రాశారు. వారిదగ్గరనుంచి Instruction వచ్చేవరకూ వాటిని తెరవడానికి వీలులేదు. Instruction వచ్చినతరువాత తెరిస్తే మంచిదని చెప్పారు మీరంతా ఈ నీరామీద మాట్లాడుతున్నారు కాబట్టి ఈ announcement చేస్తున్నాను.

Sri K. Rajagopala Rao.— కల్లులోకూడా food value ఉన్నదనే ఒక వాదం ఉంది. అది నిజమో అబద్ధమో తెలుసుకుంటే దానికికూడా ఒక expert opinion వస్తేది.

The Hon. Sri T. Prakasam.— ఈ మూడుబుడ్లు ఎలావచ్చాయి అంటే వాళ్లకువచ్చిన పెద్దసరుకులో ఇవి మిగిలిఉన్నాయి. మీ telegram మీద పంపిస్తున్నాం అని చెప్పారు. (interruption) మీరు దీనికీ జవాబుచెప్పుతారని చెప్పడంలేదు. అన్నిటికీ కూడా జవాబు చెప్పగలవారు యిక్కడ ఉన్నారు.

Sri N. V. Rama Rao.— ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారు నీరానుగురించి ఏదోచెప్పారు. అది ఎందుకు చెప్పారో, వారి ఉద్దేశం ఏమిటో, వారి సలహా ఏమిటోకూడా మాకు అర్థం కావడంలేదు. మెంబర్సు అందరికికూడా అర్థం అయినట్లు కనబడుటలేదు. సరిగా అర్థం అయ్యేటట్లు చెప్పమని కోరుతున్నాను. అది వారు ఎందుకు యీ సందర్భములో చెప్పారో తెలియకున్నది. వారి ఉద్దేశ్యము సరిగా తెలుపుట మంచిది.

27th May 1954]

Mr. Speaker — "It is not for me to ask you to make out a point. Hon. Members who have heard him may make any point out of it.

Sri G Latchanna — ముఖ్యమంత్రిగారుచేసిన స్టేట్ మెంట్ మీద ఏమీ point చేయనక్కరలేదని మీరు ruling యిస్తున్నారా? లేక Chief Minister Statement ను మేము తీసిపారేయవచ్చుని, వారు చెప్పినది ఏమీ అర్థంకాలేదని ఒకసభ్యుడు అడుగుచున్నప్పుడు వారు చెప్పినదానిలో ఏ point కూడా point out చేయనక్కరలేదని చెప్పితే మేము తీసిపారేస్తాం.

Sri T Nagi Reddi — అధ్యక్షా! ఒక్కమనవి ముఖ్యమంత్రిగారు మధ్యలో ఇంటర్వీన్ అయ్యారంటే దానిలో పెద్ద అర్థం వుండితీరాలి. ఇది తమాషాకు చేశారంటారా? ఇంత సీరియస్‌గా చర్చలు జరుగతున్నప్పుడు మధ్యలోలేచి కొంత information చెప్పినప్పుడు వారి ఉద్దేశ్యమేమిటని అడగటం మంచిది. దానికి ముఖ్యమంత్రిగారు సమాధానం చెప్పడంకూడా మంచిది.

The Hon. Sri T. Prakasam — ఇంతపెద్ద point ఎత్తారుకనుక రెండు మాటలు చెప్పడం సహజం. నాకు వచ్చిన ఉత్తరంలో ఉన్నసంగతి గురించి ముక్తసరిగా రెండుమాటలు చెప్పాను. ఆ రామారావుగారినే ఈ ఉత్తరంచదివి అందరికీ వినిపించమని కోరుతున్నాను.

Sri T. Nagi Reddi :— అది చదవాలా, అక్కరలేదా అనికాదు, అది పత్రికలకు యిస్తే వాటిల్లోపడితే అందరూ చదువుకుంటారు. మాకు యిస్తే మేమే చదువుకుంటాము. వచ్చిన ఉత్తరంలోవున్న information ప్రకారం నీరా 2 నెలలుకాదు, 6 నెలలువరకూ వుంటుందని చెపుతున్నారు. ఏ ఉద్దేశంలేకుండా నేను ఒక information చెపుతున్నాను అని తక్షణమే చెప్పవలసిన అగత్యం ఏమివచ్చింది అని అడుగుతున్నాను.

The Hon. Sri T. Prakasam :— ఒకపెద్ద చర్చ జరుగుతున్నప్పుడు ఈ చర్చకు కొంతవరకు సహాయంచేసినవాడిని అవుతానని అనుకుని దాన్నిబట్టి కొంతవరకుఅయినా ప్రయోజనం వుంటుందని చెప్పాను. ఈ paper ను కూడా మీముందు పెడుతున్నాను. (So saying the Chief Minister handed over a heap of papers to the Speaker)

The Hon. Sri N. Sanjeeva Reddi :— నీరాలోకూడా food value వుందనిచెప్పి information యిస్తే దానిమీద చర్చలేవదీస్తే ఏమి చెప్పను? అదికూడా మంచిదన్నీ చెప్పారు. మీరు ఇక ఒప్పుకోరనికూడా తెల్సును. కాబట్టి ఇక చర్చ చేయవద్దన్నా...

Sri T Nagi Reddi — సీరియస్‌గా డిబేట్ జరుగుతున్నప్పుడు ఈ నీరా 10 నెలలుంటుంది కాబట్టి ఓటు వేయాలని చెప్పడానికే ఉపయోగపడుతుంది. ఉద్దేశ్యంచెప్పకుండా, కారణంచెప్పకుండా information కోసం చెపుతున్నాం అంటే అది information కోసం చెప్పడంకాదని protest పెట్టడం తప్పదు. అదే ఉద్దేశం అయితే సైక్లోస్టయిలు తీసి మాకు కాపీలు ఇచ్చేవాళ్లు.

The Hon Sri N Sanjeeva Reddi — Information is an information. దానికివేరే explanations చెప్పమంటే అర్థంలేదు.

Sri G Latchanna — వారియొక్క ఉద్దేశమేమిటో చెప్పకుండా......

About the validity of the position of the statement of the Chief Minister.

Mr. Speaker:— He has made a statement. What is the significance of it, you ask me? It is for the members of the House to understand the significance. (Laughter) If you think there is no significance, all right, leave it. (Laughter) If you think there is any significance, take it. That is all. (Laughter)

Sri G. Anjaneyalu — అధ్యక్షా! ఇప్పుడు Chief Minister గారు చెప్పినదాన్నిబట్టిచూస్తే 'యీ వేళ మనకు యిది కొత్తకాదు. రాజధాని విషయంలోనూ మధ్యలోలేచి ఒక statement యిచ్చారు. మొన్న ఇంకోవిషయంలోను ఇంకో statement ఇచ్చారు. ఇదైనా గ్యారంటీగా అమలుజరుపుతారా అంటే అది మాఇష్టం అంటున్నారు. కాబట్టి ఈ ప్రభుత్వపరిస్థితి దినదినగండంగా యుండుటచే, "అడుగడుగు దండాలువాడా! ఆపదమొక్కులవాడా" అన్నట్లు ఒక్కొక్క ఆపదవచ్చినప్పుడు, ఒక్కొక్క మొక్కుబడి, మ్రొక్కి ఆ ఆపదదాటిపోవాలని తోస్తున్నట్లుగా యున్నది. కాబట్టి నేను వివరాల్లోకిపోవడం లేదు. మన మద్యనిషేధ మంత్రిగారు మొన్న శ్రీ రామమూర్తి Committee ని వేసినప్పుడు, మనం ఒక్కొక్కరం ఒక్కొక్క రాజకీయపార్టీకి స్థిరపడిపోయాం కాబట్టి అన్నిటికికూడా అతీతులైన వారిని తీసుకువచ్చి ఈ కమిటీలో వేస్తున్నాం అని చెప్పారు. ఆ రోజునే మేము అన్నిపార్టీల ప్రతినిధులతో కూడిన శాసనసభ్యులతో కూడిన ఒక కమిటీని వేయమని చెప్పాం. కాని రాజకీయాలకు అతీతులని చెప్పిన శ్రీ రామమూర్తి కమిటీవారిని ఈవేళ కొంతమంది కాంగ్రెసువాదులు దూషిస్తున్నారు.

అసలు ఈ కమిటీరిపోర్టును అంతా అంగీకరించారు. కాని కాంగ్రెస్‌పార్టీ మాత్రం అంగీకరించడంలేదు. మన సంజీవరెడ్డిగారే అనేకసార్లు ప్రజలముందు ఈ విషయాన్ని స్పష్టపరచారు. ఈ విషయమై ఈ రిపోర్టును అంగీకరించము అని, కాంగ్రెస్‌పార్టీవారు కళా వెంకట్రావుగారు resign చేస్తానన్నప్పటినుంచి అంటున్నారు. గాంధీగారి మూలసూత్రం,

మూలసూత్రం అంటూ గాంధీగారి అహింసా, ధర్మ సూత్రములను అనుసరిస్తున్నామన్నారు. ఈ ఒక్కవిషయంలో తప్ప అన్నివిషయాలలోను గాంధీగారి సూత్రము లన్నిటికి వ్యతిరేకంగానే కాంగ్రెస్ పార్టీవారు నడుచుకొంటూ, గాంధీగారి ఆశయాలకే తిలోదకాలు యిచ్చేశారు. ఆనాడు బ్రిటిష్‌వారికాలంలో కాంగ్రెస్‌వారంతా జైళ్లకు వెళ్లారు, లాఠీదెబ్బలు తిన్నారు అంటున్నారు. జైలులో కూర్చున్నవారు ఈరోజు కాంగ్రెసులో యెందరున్నారు. అది మాకు అవసరం లేదంటున్నారు. ఈనాడు మాత్రం కాంగ్రెస్ పార్టీవారు గాంధీగారి ఆదర్శాలకు తిలోదకాలు యిచ్చి కాంగ్రెసువారమంటూ, గాంధీగారి మూలసిద్ధాంతాలకే యెసరుపెట్టుచున్నారు ఏమిటి కారణమని నేను అడుగుతున్నాను. కాంగ్రెస్ పార్టీవారు అహింస మొదలైన గాంధీగారి మూలసూత్రముల గురించి మాట్లాడుతారు, కాని వాటిని ఆచరణలో పెట్టకుండా గాంధీగారిసూత్రములకే తిలోదకాలను యిచ్చేస్తున్నారు. ఇది గాంధీగారిని చంపించిననాడే ఋజువైంది. కాంగ్రెస్ పార్టివారు గాంధీగారి మూలసిద్ధాంతములైన సత్యం, అహింస మొదలైన సూత్రములను గురించి విరివిగా మాట్లాడుతారు. శ్రీ లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ చట్టాన్ని ధిక్కరించి, కొంతమంది త్రాగివస్తే చావనీయండి అన్నారు. వీరు యువకులు, వేడిరక్తంగాదా అనుకుందాం. కాంగ్రెస్ పార్టీవారు అహింస నేవిధంగా పాటిస్తున్నారో చెప్పడానికి నేను ఒక దృష్టాంతం మీకు చెప్తాను. మొన్న కోటిరెడ్డిగారు మా నియోజకవర్గంలో పర్యటనచేస్తూ, మా ప్రాంతానికి వచ్చారు. అక్కడ ఒక బహిరంగసభలో ఒకరు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్తూ మేము మద్యపాననిషేధమును తొలగించేది లేదు, అని అన్నారు. కృత్రిమసారాయి చాలామంది త్రాగుతున్నారు అందువల్ల చాలామందికి జబ్బులువచ్చి చనిపోతున్నారంటే, "చస్తే చాలామంచిది ఎక్కువమంది, ఈ విధంగానైనా చచ్చిపోతే భారతదేశ జనాభా పెరిగే ఈ రోజులలో జనాభా ఈ విధంగానైనా తగ్గుతుంది." అని అన్నారు. ఇవేనా శ్రీ కోటిరెడ్డిగారిలాంటివారు చెప్పవలసిన అహింసాసూత్రాలు? ఈవిధంగా కాంగ్రెస్‌వారు గాంధీసిద్ధాంతాలకు తిలోదకాలు వదిలేశారు. అది గాంధీగారు చచ్చిపోయిననాడే ఋజువైంది. ఈనాడు కృత్రిమసారాను అమ్మే దుకాణాలు మామూలు కల్లు దుకాణాలు ఎక్కడపడితే అక్కడ ఉంటున్నాయి. ఇక్కడకూడా వున్నాయి. "చెముడు" రాణీగారితోట ఈ ప్రాంతంలోనే ఉన్నది. ఆ తోటలో ఒక దుకాణం ఉంది. అక్కడ అనేకమంది తాగుతున్నారు. వారికి Prohibition officers కాపలా ఉంటున్నారు. వారు బైటికివస్తే 4 అణాలు పుచ్చుకుంటారు. మన రాజధాని కర్నూలు పట్టణంలోకూడా కృత్రిమసారా ఎక్కువగా తయారౌతోంది. మద్యనిషేధం సక్రమంగా నెనసాగడంలేదు. దానికి ఒక కమిటీని గవర్నమెంటే వేశారు. మొదటిలో మేము ఆ కమిటీని వేయడమెందుకు, కమిటీని వేయకుండానే Prohibition ను తీసివేయవచ్చునని చెప్పి ఆ కమిటీని వేయడానికి వ్యతిరేకించాము. చివరకి గవర్నమెంట్ రామమూర్తికమిటీని వేశారు, ఆ కమిటీవారు కష్టపడి చాలా కొద్దికాలంలోనే ఒకరిపోర్టును తయారుచేసి

[Sri G. Anjaneyalu] [27th May 1954

యిచ్చారు. గవర్నమెంట్ వేసిన కమిటీరిపోర్టును గవర్నమెంట్ implement చేస్తామని ముందుచెప్పి, తీరా ఆ కమిటీరిపోర్టు submit చేసినతరువాత దానిని implement చేయము అంటున్నారు. వారు యిచ్చిన report చాలా సక్రమంగానూ అనుసరణీయంగానూ ఉన్నది. ఆ రిపోర్టులో చాలామంది పెద్దలు అన్నివిధములైనటువంటి శాఖలలోనివారిచ్చిన సాక్ష్యమును బట్టిచూస్తే ఏ కొద్దిమందో తప్ప అందరూ ఈ మద్యపాననిషేధము సక్రమంగా సాగడంలేదు కనుక చాలామంది కల్లుగీతపనివారు నిరుద్యోగులైపోయారు కాబట్టి దీనిని తీసివేయాలనేటటువంటి అభిప్రాయమును వెలిబుచ్చారు. అయినా దినదిన గండంగా ఉండే ఈ ప్రభుత్వం దానిని అమలుజరపబోవడం లేదని అన్నారు. ఈ విషయమై పత్రికలలో ప్రకటించారు. మొదట "ఈ ఒక కమిటీని వేస్తున్నాము ఆకమిటీ report యిచ్చినతరువాత దానిని అమలుజరుపుతాము, ఇపుడుకాదు," అని మాట అడ్డువేశారు. తరువాత "కమిటీ report వచ్చింది, అది మాకు అనుకూలంగాలేదు, అందుచేత దీనినిగురించి ఆలోచించాలి, ప్రస్తుతం నీరాకు అనుమతియిస్తున్నాము, వచ్చే సమావేశంలో report పై చర్చించి దీనిని అమలుపరుస్తాము" అని అడ్డుపెట్టారు. ఈవిధంగా ఈ ప్రభుత్వం దినదిన గండములను అడ్డుకుంటూ వస్తున్నది. తరువాత report ను అమలుజరుపమని, నిషేధాన్ని తీసివేయడమనేది జరగదని శ్రీసంజీవరెడ్డిగారు ప్రకటించడం జరిగింది. ఒక కమిటీని గవర్నమెంటే వేసి, ఆ కమిటీ report ను అమలుజరపటం లేదని గవర్నమెంటే ప్రకటించటంలో అర్థమేమిటి? దానిని ఏకారణంచేత అమలుపరచడంలేదని నేను సూటిగా సంజీవరెడ్డిగార్ని ప్రశ్నిస్తున్నాను! మొన్నమొన్ననే యీ ప్రాంతములో Prohibition ను తీసివేయాలని బహిరంగసభలు జరిగాయి. చెక్కుమంది మద్యపాననిషేధచట్టాన్ని తీసేయాలని చెప్పి వ్యతిరేకిస్తూ వారి అభిప్రాయములను వెల్లడించారు. అపుడు సంజీవరెడ్డిగారు, C I D లు కూడా వాటిని గమనించారు. వాటినిగురించి ఈ పాటికి అపుడే report పంపివేసి ఉంటారు అడుగడుగునా గండములుండే ఈ గవర్నమెంట్ ఈ నిషేధాన్ని రద్దుచేయడానికి ఒప్పుకోవడం లేదు. దీనికి K. L P పార్టీ ప్రజాసోషలిస్టుపార్టీ, K. M. P. పార్టీలుకూడా వ్యతిరేకంగా ఉన్నాయి దీనికి ఇంతమంది వ్యతిరేకంగా ఉన్నాకూడా దీనిని రద్దుచేయడానికి ఈ ప్రభుత్వం పూనుకోవడం లేదు. మద్యనిషేధం అమలుజరపడంవల్ల prohibition case లు ఎక్కువవుతున్నాయి, కృత్రిమసారా తయారు ఎక్కువగా ఉన్నది. ఈ కృత్రిమసారాను సేవించడంవల్ల ప్రజలకు చాలాజబ్బులు వస్తున్నాయి. దీనినిగురించి వచ్చే కేసులన్నీ పేదవారి మీదనే వస్తున్నాయి. పేదవారికే నష్టం కల్గుతోంది. అసలు భూస్వాములు సారావల్ల చాలాధనమును సంపాదిస్తున్నారు. కేసులు రోజురోజుకు పెరుగుతున్నాయి. ఉదాహరణకు మా ప్రాంతంలో జింజేరు అనే గ్రామంలో 3) మందిని అరెస్టుచేశారు. అరెస్టుచేసి ఒక్కొక్కరికి 20 రూపాయల చొ॥న జరిమానా విధించారు. జరిమానాను వారు యివ్వకో లేకపోతే వారంరోజులు జైలులో పెట్టారు. మద్యనిషేధాన్ని తీసివేయాలని చెప్తుంటే "వ్యతిరేకంగా ఉన్న పార్టీలవారు దీనిని election propaganda కి ఉపయోగిస్తు

స్నారని" ఆవైపు కాంగ్రెస్‌వారు అన్నారు. మొత్తం 200 ల మందిని మద్యనిషేధం గురించి అభిప్రాయం అడిగినట్లు రామమూర్తి కమిటీ report లో ఉన్నది. వారిలో ఏ 33 మందో తప్ప మద్యనిషేధాన్ని తీసివేయమని అందరూ అభిప్రాయములను వెలిబుచ్చారు. కొంతమంది prohibition officers కూడా ఈ నిషేధాన్ని తీసివేయమనే అభిప్రాయమును వెలిబుచ్చారు. ఈ మద్యపాననిషేధమును సాకుగాచేసుకొని దీనిని ఆయుధంగా చేసుకొని రాజకీయరంగంలో వ్యతిరేకపార్టీలవారిని హింసిస్తున్నారు. ఈమధ్యన మాప్రాంతంలో కలెక్టరువద్దకు కొంతమంది రాయబారం వెళ్లారు. రైల్వేస్టేషన్లలో పోలీసులను పెట్టారు. బందరుపట్టణమంతా పోలీసులను పెట్టారు. దీనినిఅంతా నేను మాపార్టీనాయకులు కలిసి ప్రోత్సహించుతున్నామంటున్నారు. "మెయిల్" పత్రికలోకూడా ప్రకటించారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్‌పార్టీ Vice President గారే యీచట్టాన్ని కట్టుదిట్టంగా అమలుజరపాలంటూనే త్రాగినవారిని, బట్టీలు పెట్టినవారిని ప్రొహిబిషన్ స్టేషనుకు వెళ్లి సిఫార్సులుచేసి విడిపించుకు వస్తున్నారు. కారణమేమిటి? సిద్ధాంతాలు వర్ణించడానికి ఆచరణలో అమలుపరచడానికి చాలా వ్యత్యాసమున్నది. పంచమహాపాతకమని చెప్పినవారు ఆ పాతకనిర్మూలనకు చూపించే కారణాలు, జైళ్లు, కోర్టులు జరిమానాలు, లంచాలుకాదు. ప్రజల మనస్తత్వమెలాగున్నదో, దానినిబట్టి మనచట్టాలు అమలుజరుపుతాయి. జమీందార్లకు డబ్బు, కల్లుగీతవారికి జైళ్లు, చావులు కాంగ్రెసుప్రభుత్వంవారు చేసేవి? అసలు prohibition కు అందరూ వ్యతిరేకమే. అందువల్ల ఇది సక్రమంగా కొనసాగదు. ఇంకా దీనిని కట్టుదిట్టంగా అమలుజరపడం అసాధ్యం కనుక నేను ఈ సవరణను బలపరుస్తూ ఈ రామమూర్తి కమిటీ reportలో చేయబడిన శిఫార్సులను సత్వరమే అమలుజరపాలని కోరుతున్నాను.

Sri B. Gangayya Naidu — అధ్యక్షా! ఇపుడు మన ఎదుటఉన్న సమస్యపై చాలామంది మిత్రులు మాట్లాడారు. వారివారి అభిప్రాయములను వెల్లడిచేశారు. మద్యపాననిషేధ చట్టాన్ని అమలుజరపడంలో కొంత పవిత్రమైన ఉద్దేశ్యం ఉంది. ఇది గాంధీమహాత్ముని ఆశయాన్ననుసరించే అమలులో పెట్టబడింది. దీనివల్ల సామాన్యప్రజానీకమునకు చాలా ఇబ్బందులు కల్గుతున్నాయి. మద్యనిషేధచట్టం ఉమ్మడి మద్రాస్‌రాష్ట్రంలో అమలు జరుపబడిన మొట్టమొదటి రోజుల్లో దాదాపు 30, 40 లక్షలమంది కల్లుగీతపనివారు నిరుద్యోగులై వారిజీవనం గడవడానికి చాలా కష్టమయింది. తరువాత అపుడున్న ప్రభుత్వం బంజరుభూములను వ్యవసాయం చేసుకోడానికిగాను వారికి ఉచితంగా యిస్తామని, వారికి ఇతర వృత్తులు కల్పించుతామని వాగ్దానం చేశారు. కాని ఇంతవరకు అలాంటిది ఏమీ జరగలేదు. చివరకు నీరాను ప్రవేశపెట్టారు. మద్యనిషేధం రాష్ట్రంలో ఎక్కడెక్కడ ఏవిధంగా కొనసాగుతోందో రామమూర్తికమిటీవారు పరిశీలించారు. అన్నివిషయాలను వారి రిపోర్టులో వివరించారు. వారు యిచ్చినరిపోర్టు సక్రమంగా ఉన్నది. ఆ కమిటీని గవర్నమెంటే వేశారు. ఆ కమిటీవారు యిచ్చిన నిర్ణయాన్ని అమలుజరపమని చెప్తున్నారు. ఆ కమిటీ

యొక్క నిర్ణయాన్ని అమలుజరుపకపోతే ఈ గవర్నమెంట్‌కి నైతిక stand ఏవిధంగా ఉందో నాకర్థంకావడం లేదు. నైతికంగా వీరి స్టాండ్ చాలా అధ్వాన్నంగా ఉంది. Prohibition అమలు జరిపినతరువాత పల్లెలలో, పట్టణాలలో చాలమంది త్రాగుడు త్రాగడం మొదలుపెట్టారు. కృత్రిమసారాను తయారుచేయడం మొదలుపెట్టారు కేసులు ఎక్కువవుతున్నాయి. కేసులు ఎన్ని పెరిగాయో కోర్టులే మీకు చెప్తాయి. దొంగసారా తయారుచేసేవారు చేస్తున్నారు ఆఫీసర్లు లంచగొండులై పోతున్నారు. అంతేకాని ఇదివరకటికి యిప్పటికీ ఏమీ తేడాలేదు. Prohibition అమలులోకి వచ్చినతరువాత పల్లెలలోను పట్టణాలలోనూ యించుమించు ప్రతివారు కృత్రిమసారాను వాడుతున్నారు.

ఇదివఱకు ఏకొద్దిమందో వాడేవారు. ఇప్పుడు ఆడవాళ్లు, పిల్లలు అంతాకూడా వాడుతున్నారని ప్రతిశాసనసభ్యునికి మంత్రులకు తెలుసు. తెలిసివుండేకూడా రామమూర్తికమిటీ సిఫార్సులైనా అంగీకరించి ప్రజలయొక్క వుద్దేశాన్ని నెరవేర్చడానికి కొంతయినా ప్రయత్నంచేసినట్టు కనుపించలేదు. ఇక నల్లమందు గుఱించి ఒకవిషయం. అనకాపల్లినుండి చోడవరం పోయేదారిలో వెంకన్నపాలెం జంక్షనువద్ద ఒక bus లో 40 తులాల నల్లమందు ప్రొహిబిషను staff పట్టుకుని ఒక ముసలమ్మను అరెస్టుచేశారు. కేసువిచారణచేసిన time లో సీలుచేసినటువంటి ఆ 40 తులాల bundle ను విప్పి చూస్తే 30 తులాల యిటుకరాయి అయినది. ఇది మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చారు. ఏమిచర్యతీసుకున్నారో యింతవఱకు తెలియదు ఎందుచేతనంటే వారికేదైనా complaint వస్తే జిల్లాఅఫీసర్లు, సబ్‌యినస్పెక్టరు అక్కడివారిమీద ప్రేమతో ఏదోవిధంగా తప్పించడానికి చూస్తారు కాని చర్యతీసుకోరు. బ్రిటిషువారి పరిపాలనావిధానమే యింకా సాగుతున్నది. మార్పురాలేదు. ప్రజాస్వామ్య పద్ధతి ప్రకారం పరిపాలనావిధానం మార్చి నిరంకుశత్వం తొలగించాలని ప్రభుత్వదృష్టికి తీసువస్తున్నాను. నేను ముఖ్యంగా మనవిచేసేదేమిటంటే యీసారా, కల్లుగుఱించి రామమూర్తి కమిటీవారు యిచ్చిన సూచనలు ఆచరణ యోగ్యంగా వున్నాయి కనుక వాటిని తప్పకుండా అంగీకరించాలని కోరుతూ విరమిస్తున్నాను

Sri R. V. Jagga Rao :— అధ్యక్షా ! time చాలా తక్కువగా వున్నది ఇంత పెద్దసమస్యమీద అన్నివిషయాలు చెప్పడానికి 5 నిముషాలు చాలదు. నాకు యిచ్చిన time ను యింకొకరికి వినియోగించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri M. Bapaiah Chowdari :— అధ్యక్షా ! మద్యపాననిషేధం గుఱించి ప్రభుత్వం ఒకకమిటీని వేస్తూకొన్ని సూచనలు యిచ్చారు. ముఖ్యంగా (c)

" Examine the question of retention or otherwise of the scheme and the modifications that have to be made if it is to be retained."

ఇది వుంచడమా తీసివేయడమా? వుంచేటట్లయితే వారు చెప్పేటటువంటి నిర్దుష్టమైన modifications ఏమిటి? ఈ రోజున రామమూర్తికమిటీ చేసినటువంటి సిఫార్సులను

చర్చించుకోండి అని మనముందు పడేశారు. అంతేగాని రామమూర్తికమిటీ రిపోర్టులోని సూచనలను అమలుపరచుతున్నామని చెప్పవలసిన అవసరం వున్నదా లేదా?

బాధ్యతకలిగిన కొందరు కాంగ్రెసుసభ్యులు మాట్లాడుతూ యీ కమిటీసూచన ప్రకారం నీరాకార్యక్రమం వేస్తాం అనే సూచనలు చేయడము మసిపూసి మారేడుకాయచేసే వ్యవహారంలాగ కనబడుతున్నది. మంత్రులు పదవులు వదలుకోలేరని మీరంటే శాసన సభ్యులు సభ్యత్వాన్ని వదలుకోలేరని ప్రజలు అనుకునేమాదిరిగా యీ వ్యవహారం కనబడు తుంది. శాసనసభ్యులైన మనం నీరాకు వోటు చేసినట్లయితే ప్రజలు మరచిపోరు. మనలను దించడానికి వారికిప్పుడు అధికారం లేదు కనుక నోరుమూసుకుని వూరుకుంటారు. కాని వచ్చే ఎన్నికలలో మనకు తగిన గుణపాఠం నేర్పుతారు అని మీకు తెలియచేస్తున్నాను. పూర్వం ప్రతిపక్షనాయకుడు అప్పుడు Mr యిప్పుడు Hon'ble విశ్వనాథంగారు చెప్పిన మాటలలో కొన్ని sentences తమకు నేను చదవక తప్పదు.

"I say Prohibition is to be cancelled. .... I say, 'For goodness sake, leave off this Prohibition'. I realise after five years of experience that we cannot enforce Prohibition by law......"

Later on he says thus:—

"But I must say, after my experience all these years, that although the measure was conceived with good intentions, it is impossible of enforcement." (Laughter) If I were asked to give my opinion, I would say, 'Cancel Prohibition now because it is impossible of enforcement'.. ....Sir, that it has failed, is evident from the speeches of some Members of the House who now occupy their seats on the Treasury Benches and of some who have occupied that place in the past. I shall quote for the information of the House and of the Hon. Minister for Prohibition a few opinions of some of those who have had something to do with the enforcement of Prohibition before they took up office as Minister. Sir, one Minister, Mr. Koti Reddi said that it has become practically impossible to enforce Prohibition Act. Its enforcement has led to the widespread producing of illicit liquor in effect. Mr. Koti Reddi, Sir, is now not a Minister. Therefore, I shall not pursue him. (Laughter) But, Sir, the Hon. Sri Ranga Reddi who is now a Minister—what did he say as a non-official member? He has said something which is based on his experience upon his reasoning and upon his observation. I shall only mention to the House what Mr. Ranga Reddi said in the General Discussion of the Budget for 1952-53. "I was feeling for a very long time that the Prohibition Act was not a complete success. But I did

[Sri M. Bapaiah Chowdari] [27th May 1954

not have the boldness to express my opinion on the floor of the Legislative Council. However, when I found that a leader of the Congress organisation who had also held a very high position had belled the cat and said that the Prohibition Act had not probably been a success. I thought he has given a correct lead in the matter. It is not only in the Legislature, outside also, I have found that other friends who had held the portfolio of Prohibition in the Ministry have spoken in the same strain. I wish to quote their names only because they have held the portfolio of Prohibition. Sri Koti Reddi in one of the Prohibition meetings said that the Prohibition Act was a thorough failure."

ఆవిధంగా చెప్పారు విశ్వనాథంగారు. మేము మనవిచేసినదికూడా అదే. కొత్తగా యేమీ చెప్పలేదు. ఆనాడు విశ్వనాథంగారు చెప్పినదే యిప్పుడు మేము మనవిచేసుకుంటున్నాం ఆనాడు మన అప్పటి Mr. తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ చెప్పిన ఒక sentence మాత్రం చదివి వినిపించక తప్పదు.

"If Rajaji, who brought in this legislation in this State a long time ago-about fifteen years ago-did not introduce it throughout the Province, it was because he wanted to experiment with it. He wanted to find out the loopholes in the Prohibition law; he wanted to find out the methods by which he could make it a success. When he left the Government there was some move to repeal it. But then came a set of people, I am sorry to say this, who were in a race, who were in a craze for power and extended Prohibition to all the districts in the State at one stroke."

కాబట్టి విశ్వనాథంగారు, తిమ్మారెడ్డిగారు, కోటిరెడ్డిగారు, రంగారెడ్డిగారు, గోపాల రెడ్డిగారు మాట్లాడినమాటలనే చర్వితచర్వణంగా చెప్పవలసి వుంటుంది. మనుష్యులు మారవచ్చు. మంత్రులు కావచ్చు, గవర్నరు కావచ్చు కాని వారు మాట్లాడినది అదృష్ట వశాత్తు అచ్చువేయబడివున్నవి. అవిమాత్రం నిలబడివుంటాయి.

Sri K. Malakondayya :— అధ్యక్షా ! మద్యపాననిషేధం గురించి చాల మంది వారి అభిప్రాయం చెప్పారు. ఈసమస్య చాల పెద్దది కనుక వారు చెప్పినవి వదలి వేయడం చాల అవసరం అని భావిస్తున్నాను. ఆంధ్రరాష్ట్ర కల్లుగీతపనివారలు యిచ్చినటు వంటి memorandum ప్రకారం తరువాత కేంద్రప్రభుత్వం లెక్కలు ప్రకారం యీరోజున ఆంధ్రదేశములో మద్యపాననిషేధం ఎలా అమలుజరిగిందో చూచినట్లయితే అర్థం అవుతుంది. మరొకవిషయం యేమిటంటే యీరోజు 1946 సంవత్సరంనుంచి యీ మద్యపాననిషేధం అమలుపరచడం ప్రారంభించినప్పటినుంచికూడా యిప్పటివరకూ ఎంతవరకు అమలుజరిగింది ? వచ్చినటువంటి మంచి ఫలితాలేమిటి అని చూచినపుడు అసలు యిందులో యేమి వుపయోగం వున్నదో తెలియుతుంది.

పైపెచ్చు ఇది చాలావఱకూకూడ హరిజనులు తరువాత ఇంకా వెనుకబడిన జాతులు పేదరికంలోయున్న ప్రజలకూకూడా పెద్దగోడ్డలిపెట్టుగా తయారయిందని అభిప్రాయ పడుతున్నాను. గ్రామాలలో పెద్ద భూస్వాములంతాకూడా బీదవారిమీా దకక్ష సాధించుటకు ఈ కల్లు, సారాయి అవకాశంగా తీసుకుని దుర్మార్గాలు చేస్తున్నట్లు మనకు చాలా రిపోర్టులు వచ్చినవి. ఉదాహరణకు గుంటూరుజిల్లాలో పెదనంది పాడులో లావు రామకృష్ణయ్య అనే భూస్వామి ఆ గ్రామంలోయున్న కాపు అప్పన్న అనే చిన్నరైతు పొలంలోయుండగా కక్షసాధించుటకు, పోలీసుడిపార్టుమెంటును వెంట్ట బెట్టుకుని ఒక సారాకాయి ఇంట్లో పొయ్యి క్రిందపెట్టి కేసుపెట్టారు. రెండుసంవత్సరా లయింది. 1949లో హైకోర్టులో ఆకేసు తీసిపారేశారు. గవర్నమెంటు ఈ case విషయంలో అక్రమంగా ప్రవర్తించిన పోలీసుఉద్యోగస్తులమీాదగాని, అక్రమంగా ప్రవర్తించిన భూస్వామిమీాదగాని action తీసుకోలేదు. ఇల్లాంటివి చాలాయున్నవి. టైములేదు చెప్పడానికి. మరొకటిచెబుతాను. కల్లుగీతపనివారు సమర్పించినదానిలో కల్లుగీత ఎలా అమలుజరుగుచున్నది అన్నప్పుడు గ్రామానికి 15, 16 బట్టీలు చొప్పున మన ఆంధ్రదేశంలో పనిచేస్తున్నవని ఉదాహరణగా ఇచ్చారు. మరొక 25 వేలు జనాభాగలపట్టణంలో 60 వేలు పెట్టుబడితో మూడుకంపెనీలు 40 వేలు పెట్టుబడితో ఒకకంపెనీ, ఇంకొక 20 వేలు పెట్టుబడితో ఒక కంపెనీ పనిచేస్తూ నూతనపరికరాలతో సారాయి తయారుచేస్తూ 40 వేలు పెట్టుబడికంపనీ 40 గాలనులు తక్కినవి రోజుకు 2 గాలనులు తయారుచేస్తున్నాయి. రామమూర్తికమిటీకి ఇచ్చిన రిపోర్టులో ఉన్నది. ప్రభుత్వరిపోర్టుప్రకారం 46 సంవత్సరంనుంచే మద్య పాననిషేధం అమలుజరుపబడుతున్నది. ప్రభుత్వలెఖ్ఖలప్రకారం ఎన్నికేసులు కోర్టులలో దాఖలైనవో మీాకు ఉదాహరణకు ఇచ్చి నాఉపన్యాసం ముగిస్తాను. ఈకేసులన్నీ 100 కి 90 పాళ్ళు లంచాలద్వారా మాఫీ ఐపోతూ 100 కి 10 పాళ్ళుమాత్రమే ఋజువైనవి. 1949-50 లో 34590 కేసులు register ఐనవి. 50-51 లో 40621 కేసులు register ఐనవి. 1951-52 లో 45550 కేసులు register ఐనవి. 52-53, 53-54 సంవత్సరాలలో కేసులు తీసుకోండి మొన్న ప్రశ్నోత్తరాలసమయంలో సమాధానాలు వచ్చినవి లక్షలున్నా యని అర్థం అవుతోంది. దాన్నిబట్టి కేసులు రోజురోజూ విపరీతంగా పెరిగిపోతున్నవి. లంచగొండితనం విపరీతంగా పెరిగిపోతుంది. నేను కొన్ని ఉదాహరణలిస్తాను. లక్ష్మణదాసు గారు శ్రీకాకుళంజిల్లాలో కేసులు తగ్గినవని ఉదాహరణలిచ్చారు. ప్రభుత్వలెఖ్ఖప్రకారం శ్రీకాకుళంలో 50-51 లో 20 1 కేసులు 51-52 లో 3040 కేసులు register ఐనవి. విశాఖపట్టణం జిల్లాకు 6798 కేసులు register ఐతే 51-52 లో 6061 కేసులు register ఐనవి. తూర్పుగోదావరిజిల్లాలో 34 1, 50-51 లో జరిగితే 51-52 లో 2904 జరిగినవి. కృష్ణాజిల్లాలో 47-51 మధ్య 4015 జరిగితే 52 లో 3489 జరిగాయి. గుంటూ రులో 4903, 50-51 మధ్యజరిగితే 51-52 మధ్య 4871 జరిగినవి. నెల్లూరుజిల్లాలో 50-51 మధ్య 243 register ఐతే 51-52 మధ్య 1504 register ఐనవి. కర్నూలు

జిల్లా మన శంకరరెడ్డిగారి నియోజకవర్గప్రాంతంలో 50-51 మధ్య 3692 register ఐతే, 51-52 మధ్య 5004 కేసులు register ఐనవి. కడపలో 50-51 మధ్య 3350 ఐతే, 51-52 మధ్య 4019 జరిగాయి. కావాలంటే ఎన్నో ఉదహారణ లున్నాయి. 5, 6 సంవత్సరాలనుంచి ప్రభుత్వం ఎలాంటి ఫలితం సాధించలేదని అర్థంఅవుతోంది. పైపెచ్చు ఆంధ్రదేశం మొత్తంమీద 3 లక్షల కల్లుగీతపనివారి నోట్లో దుమ్ముకొట్టారు అని ప్రభుత్వ దృష్టికి తీసుకురావలసిన అవసరం ఉన్నది. ఇది ఉపయోగంలేని, కార్యక్రమం కాబట్టి ప్రభుత్వం వెంటనే రద్దుచేయడం బాగుంటుందని ప్రభుత్వానికి ఆ పక్షమున ఉన్నసభ్యులకూ విజ్ఞప్తిచేస్తూ విరమిస్తున్నాను.

Sri K Varadachari — అధ్యక్షా! ఆంధ్రదేశం మంచికైనాసరే, చెడుగుకుఐనాసరే ముందంజవేసే దేశం. ప్రాముఖ్యత చెందినదేశంలో జాస్తీగా దొంగతనంగా కల్లూ, సారాయి తయారవుతున్నది. దీనిని ఎదుర్కోవలసిన మార్గాలు పరిశీలించి సలహా ఇస్తారని కమిటీన్ని నియమించితే వారు కల్లు బహిరంగంగా దొరికేటట్లు ఏర్పాటు చేయాలని సలహా ఇచ్చారు. ఆ కమిటీయిచ్చిన సలహా ప్రతిపక్షస్వాములు అంతాకూడా ఇది ఒక Vote catching device గా తయారుచేసుకున్నారు. ముందున్నది ముసళ్ళ పండగ అన్నట్లు వారు Political calculation లో miscalculate చేశారు. ఇప్పుడున్న వయోజన voting పద్ధతిలో 100 కి 50 మంది స్త్రీలే. అనగా 100 కి 50 మంది స్త్రీలు ఓటు వారిచేతులలో పెట్టుకున్నారు. వారిని అడగకుండా, referendum పెట్టకుండా ఎవరో Public Prosecutor, Advocate General లు ఉన్నకమిటీమీద ఆధారపడి ఆందోళన చేస్తున్నారు. రేపు మీరు ఏమిచేసినాసరే, మగవారికి ఇంత కల్లుపోసినా సరే కాని ఆడవారు మీ నెత్తిన రాయివేస్తారని తెలుసుకోండి. మీకు ఆడవారి ఓటు రాబోయేదిలేదు. వ్రాసిఇస్తాను. మీ ఇంట్లోఉండే స్త్రీలుకూడా మీకు ఓటు వెయ్యరు. కాబట్టి కొంత జాగ్రతగా, దీర్ఘంగా యోచనచేసి మాట్లాడండి గానీ నిండా స్వల్పసమాచారంగా మాట్లాడకండి. ఇక్కడ సారాయి కాచాడు, అక్కడ కల్లుదించినాడు ఇంకా figures చూడండి అని statistics చూపిస్తున్నారు. ఈ లెఖ్ఖలతో మాట్లాడకండి. నైతికదృష్టితో మాట్లాడండి. కమ్యూనిస్టులైతేమాత్రం నైతికం వదలుకోవాలా? నైతికాన్ని వదలిపెడితే హిందూదేశంలో జనాన్ని ఆకర్షించుటకు సాధ్యమవుతుందా? ఏదేశంలోఐనా నైతికంలేని సిద్ధాంతాలు చెల్లునేమోగాని, ఈ దేశంలో చెల్లదు అని మీరు చాలా గ్రహించాలని నిండా ప్రార్థిస్తున్నాను. మరీమరీ ప్రార్థించుచున్నాను. కాబట్టి ఈ విషయంలో మనం బాగుగా యోచనచేయవలసియున్నది. సాంఘికమైనవిషయం సాంఘికాభివృద్ధికి కావలసిన విషయంలో పదిమందిని అడగకుండా ఓటుకు పెట్టకండి. అందరు అన్ని రాజకీయపార్టీలలోనుంచీ కొద్ది కొద్దిగా మారి వస్తిరి. Election manifesto లో క్రొత్తక్రొత్తపార్టీ లున్నవి. మద్యపాన నిషేధం అమలుచేస్తామని ఓటు తీసుకువచ్చినప్పుడు ఆ ప్రకారం చట్టం ప్రవేశపెట్టి అమలులో పెట్టే ఉద్దేశ్యంలో కమిటీ ఏదో కొండుముక్కల report వ్రాసిందని దానిమీద ఆధార

పడిన ప్రజలయభివృద్ధి, వయోజనుల అభివృద్ధి తెలుసుకోకుండా ఒక్కసారి అసెంబ్లీలో రెండుమాటలు మాట్లాడి ఇక్కడఉండే 140 మంది మీద ఆధారపడి సాంఘికాభివృద్ధికి చేసిన చట్టం రద్దుచేస్తామని చెబితే నియంతృత్వానికి సాంప్రదాయంగా కనిపిస్తోంది. కాని మరేమీలేదు. దైవాధీనంగా తేలిపోతుందని చెబుతున్నాను. ఈవిషయంలో దీర్ఘాలోచన చేసి పెద్దవారిమాటలు విని పదిమందిని అడిగి ఓటుతీసుకొని కల్లుఅంగళ్లు కావాలా వద్దా అని చేస్తే బాగుంటుంది. ఇది ఎట్లాఉందంటే ఒక సత్రంవాకిట ఒకఖాదర్, ఒకనబీ కూర్చున్నారు, అందులో ఖాదర్ నబీతో ఏమన్నాడంటే "హారేనబీ ! భంగీత్రాగకుంటే సండెల్ హెూండి పోతుంది" అంటే నబీ ఏమీ సమాధానం చెప్పాడంటే "హారే ఖాదర్ ! కల్లూ, సారాయి పోసి తడిపీతడిపీ తాజాసెయ్యరా" అన్నాడట. ఈవాతావరణం అట్లా కనిపిస్తోంది.

Sri Pillalamarri Venkateswarlu .— On a point of order, వరదాచార్యులుగారి remark సభను అగౌరవపరుస్తోంది.

Sri Neeladri Rao Reddi — అధ్యక్షా ! ఈ prohibition సందర్భంలో అనేకవిషయాలు మిత్రులు చెప్పారు. గాని ముఖ్యసమస్య ఏమంటే రామమూర్తి కమిటి రిపోర్టును support చేయడమా చేయకపోవడమా ? మా ఉద్దేశములు తెలియజేయ బడుతాయి. అయితే ఈ prohibition సందర్భంలో ప్రజలలో ఎంతమంది త్రాగనివారు అని మొదట తేలవలెను. మనప్రజలలో ఆడవాండ్లు నూటికి యాభైమంది, మగవాండ్లు నూటికి యాభైమంది ఉన్నారు. అయితే ఆడవాండ్లలో నూటికి 50 మంది సారానిషేధం చేశారు అని తెలుసును. మన యాభైమందిలో 100 కి 50 మంది బీదజాతివారు ఉన్నారు. ఇంకా ఉన్నటువంటిదానిలో చిన్నపిల్లలు 100 కి 30 మంది ఉన్నారు. తక్కిన 17 మంది మాత్రం సారా కావలసినవాండ్లు ఉన్నారు. ఎవరు ఈ సారాయి త్రాగేది, పేదవాండ్లు. ఇది నైతికవిషయం, సాంఘికవిషయం, అర్థికవిషయం ఈ బీదవాండ్లు అర్థికంగా సారా అభివృద్ధి విడిచిపెట్టితే ఎక్కువ నష్టపడి చెడుతారు అని తెలిసినవిషయం. అయితే ప్రభుత్వం ఇపుడు అవలంబించునట్టి మద్యపాననిషేధం జరిగిందా లేదా అంటే జరుగలేదని సవ్యంగా చెప్పవలసియున్నది. Prohibition సరిగా జరుగలేదు. ఈ prohibition ను గురించి సవరణచేయగలిగితే చేయవలెను. లేకపోతే scrap చేయవలెను.

రెండవది prohibition లో దురాచారములు ఏమి కనబడినవంటే డిపార్టు మెంటులో లంచగొండితనము చాల కనబడుతుంది అని రామమూర్తికమిటీ నివేదిక చెప్పింది. కనుక చక్కగా గట్టిగా చేస్తే చేయండి. లేకపోతే scrap చేయవలెను. కల్లు అంటే చెట్లనుండి తెచ్చిన పానం. కూలీ వాండ్లందరు అనేకమంది కల్లుగీతపనివారు, వారు పని పాట్లు లేకుండా ఉన్నారు. కల్లుగీత free గా విడిచిపెట్టితే ఆ సమస్య తీరుతుంది. Prohibition report లో వ్రాసిన పర్మిటు system నాకునచ్చలేదు. దానిలో మరింత అన్యాయం జరుగుతుంది. ఈ సీరా తప్పక చట్టముగ ఉంచవని నా కోరిక.

జరపాలంటే గాంధీజీ వ్రాసిన మాటలనుబట్టి, ఎవరు త్రాగుచున్నారు? ఎందుకు త్రాగుచున్నారు, అని విచారణజరిపి economic అంటే ఆర్థికంగా, cultural గా ప్రజలను అభివృద్ధిచేసినాడు ఇది సాధ్యమవుతుందిగాని, తుపాకులతో, జైళ్ళతో, లారీలతో, పెద్ద పెద్ద చట్టాలతో ఇప్పుడు ఆలోచిస్తూయున్నట్లు సమిష్టి జరిమానాలతో ఆచరణలో పెట్టడం అసాధ్యం. అది ప్రపంచం నేర్పిన గుణపాఠం. ఈ గుణపాఠం ఈనాడు తీసుకోదలచుకున్నామా, లేదా? తీసుకోదలచుకోలేదు. కమ్యూనిస్టులు పేదవాళ్ళను త్రాగమంటున్నారు. పేదవారిమీద కమ్యూనిస్టులకున్న ప్రేమ ఇదేనా అని ప్రగడకోటయ్యగారు వాపోయారు. కమ్యూనిస్టులకు పేదవారిని ఉద్ధరించుటకు ఒక కార్యక్రమం ఉన్నది. దానికి కోటయ్యగారు ఎప్పుడూ వ్యతిరేకమే. మన జాతీయవిధానంలో ఏర్పర్చుకొన్న కార్యక్రమం సామ్రాజ్యవాదుల ఏలుబడినుంచి, దేశాన్ని తప్పించుటకుగాను, మనదేశంలోయున్న భూస్వామ్య విధానం నాశనంచేయడం, సంస్థానాధిపతుల ఆస్తులు జాతిపరంచేయడం, తద్వారా ప్రజానీకానికి అవసరమైన, ఇపుడు మనంకోరుతూయున్న నిరుద్యోగసమస్య తొలగించడం, తద్వారా ప్రజల కొనుగోలుశక్తి పెంచడం, తద్వారా ప్రజల కవసరమైన సాంఘిక, సాంస్కృతిక అవసరాలు తీర్చడం, దాని ద్వారా వారిని అభివృద్ధిపరుస్తూ, చట్టంలేకుండానే మద్యపానం రాను రాను తగ్గించుటకు అవకాశం ఏర్పడుతుంది అనే ప్రాథమిక సూత్రాన్ని మనం అంగీకరించకపోతే, మద్యపాన నిషేధాన్ని తప్పకుండా తుపాకులతో, లారీలతో అమలు జరుపుటకు ప్రయత్నంచేసి సంవత్సరం, సంవత్సరం ఏర్పడే results చూచాం, కొంతమంది మిత్రులు లెఖ చెప్పారు. 6 వేలమంది arrest ఐనారు. మరల కావలసివస్తే arrest కావడానికి సిద్ధంగాయున్నారు. దేశంలో పెద్దపెద్ద శక్తులున్నాయి. అటువంటి శక్తులను అరికట్టడం అసాధ్యమనే కార్యక్రమం గుర్తించడం అవసరం. అందువల్ల మద్యం త్రాగకుండా చేయాలంటే ఏపద్ధతి అనుసరిస్తే, ఆచరణ యోగ్యంగా యుంటుందో ఆలోచించాలి. చిన్నచిన్న కార్యక్రమాలు వీరిబాధలను తొలగించడానికి ఉపయోగపడదు. కౌలుదారి సమస్య, బంజరుభూముల సమస్య మినిమంవేజస్ ఆక్టు మొదలైనవాటిని ఆచరణలో పెట్టి దానిని కొద్దిగ అభివృద్ధిచేయుటకు తోడ్పడకపోగా దానిని బలపరచేదికూడా సున్న. అభివృద్ధికరమైన చట్టమని సినిమాలో సిగరెట్లు త్రాగకూడదట. దానికంటె ప్రధానమైన చట్టములు ఉన్నాయి. ఆలోచించుకుంటే మనము చేసే చట్టములను బట్టి ప్రజలకు ఏమిమేలు జరుగుతుందో నేను చెప్పవలసిన అవసరం లేదు. ఇకపోతే నైతికశక్తి కనీసము (moral standard) అయినా లేదా మన కమ్యూనిస్టులకు అని వరదాచారిగారు అన్నారు. ఆంధ్రకాంగ్రెసులోనే ఇది కనబడుతుంది. ఉత్తరప్రదేశములో కాంగ్రెసురాజ్యము ఏలుతుంది. అస్సాములో $\frac{1}{3}$ నైతికంగా ఉంది. మనము $\frac{1}{8}$ కంటె ఎక్కువ దేశములో ఉన్నాము. నైతికముగ జాగ్రత్తగ మాట్లాడవలెను. బంజరుభూముల విషయంలో నైతికసూత్రములు అంటే జాగ్రత్తగ యోచిస్తే. In Assam it has not been

possible to introduce total prohibition of liquor There is only prohibition of opium in the state అస్సాంవాండ్లకు నల్లమందునైతికం ఉంది. పంజాబులో ఒక్కజిల్లాలో మాత్రం ప్రొహిబిషన్ ఉంది. మనము experiment చేస్తూ ఉంటే దానిని సరిగా పరిశీలనచేయవలెను. దానిని అంగీకరించకూడదు.

అయ్యో, ఈ మారల్సునుగురించి మాట్లాడినపుడు వ్యభిచారాగృహములను నిర్మించితే ఇంకా ఎక్కువ డబ్బు వస్తుంది అన్నారు. వాండ్లు మంత్రులుగా వస్తే అలా చేయవచ్చును. కోటయ్యగారు దొంగతనం, వ్యభిచారములను గురించి చెప్పారు. ఆ మిత్రులకు నేను చెప్పే సమాధానం ఒకటే. crime అంటే ఒక వ్యక్తిమీద మరొకవ్యక్తి చేసే అత్యాచారం. ఆచర్యలు ఇతరులను బాధిస్తుంది. అందువల్ల వాటిని అరికట్టవలెను. నాగిరెడ్డి సిగరెట్టు త్రాగుతున్నాడంటే నేను పాడుకావడానికి అవకాశం ఉందిగాని ఇతరులను పాడుచేయడానికి అవకాశం లేదు.

Sri P. Kottayya :— త్రాగడంవల్ల తాను కాకుండా తనచుట్టూ ఉండే కుటుంబంకూడ పతనం అవుతుంది.

Sri K. Varadachari :— Crime cannot be committed on one's self also.

Sri T. Nagi Reddi .— I may not be a lawyer of the quibbling type, but I know something of law.

సొసైటీలో ఎన్నోదురలవాట్లు ఉంటాయి. వాటిని తొలగించడానికి మన కర్తవ్యాన్ని చేయలేకపోయినపుడు వెంటనే లాటీలు, తుపాకులతో చలాయించడం సాధ్యం కాదు. విద్యవిజ్ఞానంద్వారాను, బీదల జీవన సౌకర్యములను పెంచి, ఈ దురలవాట్లను తొలగించవలెను. సిగరెట్టు చెడ్డది అని నాకు తెలుసును.

లంచగొండితనము కేసుదొరకదు. దొరికి కేసుపెట్టితే వాండ్లు లంచము తీసుకొన్నట్లు రుజువు కాలేదంటాడు కలెక్టరు. త్రోసివేస్తాడు. లంచగొండితనమువల్ల ఇతర వ్యక్తులను బాధించడం జరుగుతుంది.

కాబట్టి ఇది పద్ధతికాదు, ఇది మార్గముకాదు. ఈ డబ్బుతో మనము projects కట్టవచ్చు అన్నారు. దానితో కట్టము. దీని విషయంలో ఎంతోమంది జెయిళ్లకు పోయ్యారు. లెక్కలు తీయండి అందులో Land-lords దొరకరు. డబ్బుగలవాండ్లు ఉండరు. దీనిని ఆర్థికస్తోమతు పెంచుటకు ఉపయోగించరాదా? ప్రజలు తిండిలేక అడుక్కొనితినేవాండ్లకు ఉపయోగించడంలో నైతికం అడ్డంవచ్చిందా? ఇంటిలో పెండ్లానికి చీర లేకపోతే కొనుక్కొనుటకుపోతే దానిమీద sales టాక్సు. దీనికి అంతకు నైతికం అడ్డంకాదు. Crimes increase అయింది అన్నారు. శాస్త్రజ్ఞులు పరిశీలనచేసి పుస్త

27th May 1954] [Sri T. Nagi Reddi]

ములు వ్రాశారు. ఆర్థికస్తోమతు తగ్గినపుడు, నైతికసూత్రములకు విలువతగ్గిపోతుంది. లంచములు ఇవ్వడం. తీసుకోవడం ఎక్కువ అయింది. శాంతి భద్రతలకు respect అనేది లేదు. ఇవన్ని crimes increase అగుటకు కారణము అయింది. రామమూర్తికమిటీ రిపోర్టును detailedగా పరిశీలన చేయవలెను. తరువాత action తీసుకొనవలెను

"In the meanwhile the Government should create employment to the ex-toddy tappers by utilising sweet Toddy Rules and also utilise all surplus neera for conversion into jaggery with the aid of suitable machinery set up for the purpose!"

మనలను మనం డిసీవ్ (deceive) చేసుకొని ప్రపంచాన్ని deceive చేయవద్దని చెప్పుతున్నాను. ఇది తప్పు-ఆచరణ సాధ్యంగాదని చెప్పినవాళ్లను విశ్వసిస్తున్నాము. ప్రకాశం పంతులుగారు - నీరాను యిచ్చాం - నీరాను యిచ్చాం - అని చాలాసార్లు చెప్పారు. ఇది స్వామి సీతారాంను గురించి చెప్పారేగాని, మా గురించి చెప్పలేదని చెప్పారు. అది చాలా ప్రమాదరకరమైనదని చెప్పుతున్నాను. దానిని ఆచరణలో పెట్టవద్దు. దానిని వ్యతిరేకించటం చాలా అవసరం. దానిద్వారా తరువాత బాగుపడటానికి, అభివృద్ధిచేయడానికి వీలు వుండేమో అంటే, మేము చెప్పేది ఒక్కటే - ప్రజలసమస్యలను తీర్చడానికి సక్రమమైన కార్యక్రమమును ఏర్పాటుచేసి ఆచరణలో పెట్టాలని ప్రజలను లంచగొండితనంకుcrimesకు ప్రభుత్వంమీదగూడ నమ్మకంలేకుండా చేసేటటువంటి యీ దురదృష్టకరమైన పద్ధతులు వదలిపెట్టాలి. చాలామంది కాంగ్రెస్‌వారే చెప్పారు. ఇది fail అయిందని. ఒకటి ఇక్కడ చెబుతున్నాను. శ్రీ అడుసుమల్లి గోపాలకృష్ణయ్యగారు చెప్పారు. సిద్ధాంతములో జరిగినవి చెప్పారు. వారు చెప్పినదాంట్లో అసత్యం వుందా? శ్రీమతి కోటమ్మరెడ్డిగారు చెప్పారు. ఇంకా చెబుతున్నాను. శ్రీ తిమ్మారెడ్డిగారు మంత్రిగాకపూర్వం చెప్పారని - శ్రీ కోటరెడ్డి గారు మంత్రిగాకపూర్వం చెప్పారని శ్రీ T. విశ్వనాథంగారు గూడ ఒకప్పుడు చెప్పారు. శ్రీ తిమ్మారెడ్డిగారు చెప్పింది పుస్తకంలోవుంది. శ్రీ విశ్వనాథంగారు చెప్పినట్లు మన బాపయ్యచౌదరిగారు చెప్పారు. వీటి నన్నింటిని మరచిపోవటం చాలా హాస్యాస్పదమని చెప్పుతున్నాను. దీనిని ఆచరణలో పెట్టటం అసాధ్యం అని చెప్పినప్పుడు న్యాయంగా ఈ ప్రొహిబిషన్‌ను scrap చేయటం మంచిదని చెప్పుతున్నాను. ఇంతకు మించి చెప్పవలసింది ఏమీలేదు. వచ్చినటువంటి వాటిలో కొన్ని కమ్యూనిస్టుపార్టీ మీద వేసినవాటికి సమాధానాలు చెప్పాను. అసెంబ్లీ ఏర్పడి రెండు మూడు సంవత్సరములైనా వీట్లమీద కొన్ని reports వచ్చినప్పటికీ ప్రభుత్వం ఆలోచిస్తామని చెబుతూనే కాలయాపన చేస్తున్నది. ఆ తరువాత వార్తేరులో దీనినిగురించి ఆలోచిస్తామని చెప్పి Budget లో కొంతమంది ఓట్లు సంపాదించు చున్నారు, ఈనాడు యీ తీర్మానమును అసెంబ్లీముందుకు రావడానికి అవకాశం చిక్కించి నటువంటి మిత్రులందరికీ నా కృతజ్ఞత తెలుపుతున్నాను. మేము యిచ్చినటువంటి

(శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తదితరులు) amendment కు తప్పకుండా మీరందరూ ఓటుచేసి ఈ కార్యక్రమమును జయప్రదంచేయవలసినదిగా కోరుతున్నాడు.

The Hon Sri K. Koti Reddy — On a point of personal explanation, Sir, నాగిరెడ్డిగారు మాట్లాడినదాంట్లో నా విషయంగూడ చెప్పారు. అందుకుగాను పర్సనల్ explanation చెప్పకుంటున్నాను. నేను అప్పుడు చెప్పిందిగూడా ప్రొహిబిషన్ సరిగా జరగటంలేదంటే అది అసాధ్యమైన పనిగాదు. పూర్తిగా నేరవేర్చే దానికి ఏలాటి అసాధ్యంలేదు. తప్పకుండా చేయవచ్చునని చెప్పాను. కోటిరెడ్డి గవర్నమెంటులో వున్నంతవరకు తప్పకుండా ప్రొహిబిషన్‌ను అమలు జరిగేలాగు చేస్తాడు.

Sri T. Nagi Reddi — ఇప్పుడు మంత్రులుగావున్న సంగతి మంత్రిగారు మరచిపోయారా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— అధ్యక్షా! ఈనాటి కార్యక్రమంలో యింతవరకు 29 మంది సభ్యులు మాట్లాడారు. శ్రీ జగ్గారావుగారిని వదిలి పెట్టి వారికి నా అభినందనాలు తెలుపుతున్నాను. జగ్గారావుగారి time గూడ మనకు వచ్చింది గాబట్టి వారికిగూడ అభినందనాలు తెలుపుతున్నాను. విషయం చాలా ముఖ్యమైనది. ఈనాడు మనకు స్వరాజ్యం వచ్చి మనం ఈవిధంగా కూర్చోటానికీ మనం స్వతంత్ర దేశీయుల మని చెప్పకోటానికీ ప్రభుత్వం నెలకొల్పుకునే అవకాశం కల్పించినటువంటి గాంధీ దేవుడు కన్నకలల్లో ఒకకల ఇది అని చెప్పుతున్నాను. (మధ్యలో ఎవరో మాట్లాడబోయినారు.) మీరు చెప్పినప్పుడు, అందులో నన్నుగురించి మాట్లాడినప్పుడుగూడ సహించి వింటున్నాను. నేను మాట్లాడేటప్పుడు, మధ్యలో మాట్లాడవద్దనీ seriousness ను maintain చేయవలెనని కోరుతున్నాను. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనిని ప్రజానీకానికి (ఆమాటలకు వారు ఏవిధంగా చెబుతారో) తిండికి అల్లాడిపోతున్న వారి విషయంలో గాంధీ మహాత్ముడు బాగా పరిశీలించి యీ మద్యపాననిషేధాన్ని హిందూదేశములో అమలుపర్చమని చెప్పారు. అన్నిరాష్ట్రాంలోకంటే ముందుగా దీనిని మన రాష్ట్రములో అమలుపరిచే అవకాశం దక్కింది. ఆ గాంధీమహాత్ముడు కళ్లు మూశాడు. వెంటనే ఈ మద్యపానంమీద చర్చను తీసుకొనివచ్చి ప్రజలకు విషాన్నో, పాషాణాన్నో వదలిపెట్టుతున్నారు. గౌరవసభ్యులు సభలో యిప్పుడు వేళాకోళాలు పాటించక ఇందులోవున్న తీవ్రతను గమనించి ఒకనిర్ణయం చేయాలని కోరుతున్నాను. ఈ సభలో చెప్పినవాటిలో మావిషయాలను కొన్నింటెని, ఇతర సభ్యులుకొందరు మాట్లాడారు. కాలవిలంబనముకాకుండా ముఖ్యమైన వాటికి నేను చెప్ప వలసినంతవరకు చెబుతాను. నాసమాధానం చెప్పినతరువాత గూడ మీ అభిప్రాయాలను మార్చుకుంటారో, లేదో తెలియదుగాని నావిధిని నేను నిర్వర్తిస్తాను.

శ్రీ పోటూరి హనుమంతరావుగారు, ప్రతిపక్షంతరఫున ఏవో కొన్నిఅభిప్రాయాలు చెప్పారు.

Illicit distillation పెరిగిపోతున్నదన్నారు. కాని దీనిని ఎక్కువ డబ్బు ఉన్నవారే హెచ్చుగా చేయిస్తున్నారు, ఇది భాగ్యవంతులకు లాభకరమైనటువంటి trade అని వారు చెప్పారు. నిజంగా వారు బీదవారియందు అభిమానము ఉన్నవారే అయితే,—వారు బీదలయందు అభిమానముగలవారే ననుకొంటాను. లేక అది భ్రమ అయి ఉండవచ్చు - నిజంగా ఆవిధంగా బీదవారిపైన అభిమానమున్నవారే అయినట్లయితే, వారి constituency లో ఆవిధంగా Illicit distillation జరుగుతున్నప్పుడు ఇక్కడ ఒక Prohibition Act అనేది ఉన్నప్పుడు ఆ ప్రజానీకానికి మేలు కలుగజేయడానికి ఆవిధంగా చేస్తున్నవారిని ఎందుకు పట్టివ్వలేదు. వారివిషయమై ఎందుకు చెప్పలేదు. దాన్ని ప్రభుత్వదృష్టికి గాని, అక్కడ ఉన్నటువంటి department దృష్టికిగాని ఎందుకు తీసుకొనిరాలేదు. ఆ ప్రజానీకాన్ని బాగుపరచడానికి ఎందుకు ప్రయత్నించలేదని అడుగుతున్నాను. గోపాలరెడ్డిగారు 1952 ఎన్నికలో ఓడిపోయినవెంటనే Prohibition fail అయిందని అన్నారని ఆ ఒక్కమాటనే గట్టిగా పట్టుకొని చెప్పుతున్నారు. అనేకసార్లు గోపాలరెడ్డిగారు Prohibition మంచిదని, బీదప్రజానీకానికి మేలుకలిగిందని, బీదప్రజలు బాగుపడ్డారని చెప్పినమాటలన్నీ మధ్యపరచి ఏనాడో ఒకసారి Prohibition fail అయిందని అన్నమాటను నొక్కిచెప్పడంలో విశేషంలేదు. నేను చెప్పేది మొత్తముమీద తమ constituency లోని ప్రజలు బాగుపడాలనే అభిప్రాయముంటే, ఈ విధంగా అక్కడ భాగ్యవంతులు పాడుజేస్తున్నారని తెలిసినపుడు, ఆ పరిస్థితులను సరిపెట్టి ప్రజలకు మంచిచేయడానికి ఎందుకు ప్రయత్నించరు? ఈ విషయంలో ఇప్పుడు దాదాపు 29 మంది మాట్లాడారు కదా వీరిలో ఏ ఒక్కరుగాని ఈ Prohibition చెడ్డదని చెప్పినట్లుగా కనపడలేదు. Prohibition సరిగా enforce కాలేదని దానివల్ల నష్టమువస్తున్నదనే చెప్పారు గాని చెడ్డదని చెప్పలేదు. నిజమే, వారు చెప్పినదానిలో కొంతమట్టుకు సత్యముండవచ్చు కాని ఆ విధంగా ఉన్నంతమాత్రాన అది పనికిరాదని చెప్పుటకు బదులు ఆ లోపాన్ని సరిచేసి ప్రజానీకాన్ని బాగుచేసే నిమిత్తం దాన్ని సరిగా అమలుపరచేందుకు ఎందుకు ప్రయత్నించకూడదు. అవిధంగా చేయుటకుబదులు, ప్రజానీకానికి హానికరంగా దీనిని వ్యతిరేకించడమేనా ప్రజాప్రతినిధులమైన మనం చేయవలసిన పని, అని అడుగుతున్నాను. ఇదేనా ప్రజారాజ్యం అని ప్రశ్నిస్తున్నాను. ఈ విషయంలో మీ అభిప్రాయమేదో, నా అభిప్రాయమేదో, కలలుగన్న గాంధీగారి అభిప్రాయమేదో, ఈ మూడు పెట్టుకొని విచారణ చేసుకోండి.

తరువాత జైళ్లకువెళ్లినవాళ్లలో ఈ Prohibition offences చేసినవాళ్లు చాలా తక్కువమంది ఉన్నారని హనుమంతరావుగారన్నారు. కాని ఈనాడు ఈ Prohibition లేకుండా అందరిని విచ్చలవిడిగా త్రాగనిచ్చామంటే, త్రాగి ఆ మత్తుతో ఎంతమంది ఎన్ని కృత్యాలు చేసి తత్ఫలితంగా ఇంకెంతమంది జైలుకుపోవలసియుంటుందో ఆలోచించుకోండి: మాలకొండయ్యగారు పాపము ఆ Prohibition offences list కూడ సంపాదించుకొని

వచ్చారు. దాన్ని చూశాను. దానిప్రకారం చూచినప్పటికి ఇంకా ఈ offences కొన్ని జిల్లాలలో తగ్గినట్లే నాకు కనిపిస్తున్నది ఉదాహరణకు తూర్పుగోదావరిజిల్లాలోను, క్రిష్ణా జిల్లాలోను ఈ offences సంఖ్య తగ్గినట్లు కనిపిస్తున్నది.

Sri K Malakondayya — 52-53 figures చూడండి, లక్షలకొలది ఉన్నారు.

The Hon Sri S. B. P. Pattabhirama Rao — దానికి ఎంతవిలువ ఇవ్వాలో ప్రజలకుకూడ తెలుసు.

మోటూరి హనుమంతరావుగారు direct principles గురించి చెప్పారు. ఇన్ని direct principles ఉంటే, ప్రత్యేకంగా ఒక్క మద్యపాన నిషేధానికే ఎందుకు ఆ direct principles పెట్టారు, విద్యావిధానానికిగాని మరింకోదానికిగాని ఎందుకు పెట్ట కూడదని సెలవిచ్చారు నిజమే! ఇప్పుడు పెట్టిఉన్న direct principles నే నిలుపుకోలేక బాధపడుతూఉంటే, ఇంకోదానికి పెట్టమని సలహాఇస్తున్నారు. ఎంతటిన్యాయమిది! ఈ సలహాలు రాకముందే direct principles పెట్టారు. ప్రజలకు లాభకరమనిచెప్పి పెట్టారు. లాభముకాదని ఎవరు అనడంలేదు. అందరు దానికి ఒప్పుకుంటున్నారు కాని అది సరిగాలేదు అనిచెప్పి, ఆ direct principles ఇంకోదానికి ఎందుకు పెట్టకూడదు అని అంటున్నారు. ఐక్యమద్రాసురాష్ట్రంలో ఉన్నప్పుడు విద్యావిధానంలో అటువంటి direct principles పెట్టగా, అది పనికిరాదని అన్నారు, నేను దానికి ఒక కమిటీవేశాను. ఆ కమిటీ ఇచ్చిన రిపోర్టును పరీక్షచేయాలని అనుకొంటున్నాను. హనుమంతరావుగారు direct principle అని అంటున్నారు కాని, మనమింతవరకు పెట్టినటువంటి direct principle ను నిలుపుకొనడానికి ప్రయత్నం చేస్తేనే ముందు మరికొన్నిటిగురించి ఆలోచించవచ్చు. స్వామి సీతారాం ఉపవాసదీక్షనుగురించి మాట్లాడారు. ఈ సమయంలో దాన్నిగురించి చెప్పడంమంచిదిగాదు. ముందుచెప్పుతాను ఆవిషయము. సీరాకు అనుమతి ఇవ్వడం, ఇదేమి కొత్తదికాదు. Prohibition Act లో ఉన్నది. దాన్ని సక్రమంగా అమలుజరుపడానికి చూస్తున్నాము. ఇది కొత్తగాదు.

తరువాత, రాజేశ్వరరావుగారు హరిజనులయొక్క బాధలు, వారికష్టసుఖాలు తెలిసినవాడు గనుక—వారికష్టసుఖాలు తెలిసినవాడనే నమ్ముచున్నాను. బీద ప్రజానీకానికి ఈ Prohibition ఏవిధంగా మేలుచేసినది చక్కగాచెప్పాడు. ఆయనచేసిన ప్రతిదీ నమ్మకముండే చేస్తున్నాడని అనుకొంటున్నాను. కాదనిఅంటే ఈవిషయంగురించి చెప్పదలచుకోలేదు. కనుక రాజేశ్వరరావు చెప్పినదానితో పూర్తిగా అంగీకరిస్తున్నాను. వారు చెప్పిందంతా బాగుందనే అనుకొంటాను.

పిమ్మట గుంటూరునుంచి వచ్చిన N. V. L. నరసింహారావుగారు మాట్లాడుతారు. ఈయన సుప్రసిద్ధ Criminal lawyer. అందుచేత వారు నాకు తెలుసును. మంత్రి

వర్గముయొక్క ప్రతిష్టతనుగురించి మాట్లాడారు ఎటువచ్చి కణ్వాశ్రమము కనపడలేదు, శకుంతల కనపడలేదని బాధపడ్డారు. ప్రేమపురాణమంతా వెలిబుచ్చారు. స్వామిసీతారాంను గురించి మాట్లాడుచూ, వారితపస్సుఫలితంగా ప్రజలకు లాభముకలిగిందనుకొంటున్నారు గనుకను, అందువల్లనే నీరాకు అనుమతినిచ్చినారు గనుకను, వారిపేరు నీరాబుడ్లమీదవేసి అమ్మమని అన్నారు.

Sri N. V L. Narasimha Rao — స్వామి సీతారాం ప్రాణాలు కాపాడేందుకు ప్రభుత్వం నీరా పద్ధతిని ఏర్పాటుచేశారని పేపర్లలోపడిందని అన్నాను.

The Hon. Sri S B. P Pattabhirama Rao — స్వామిసీతారాం చెప్పుచున్నదినిజమే. బీదప్రజానీకం మేలుకొరకే అవిధంగాచేశారు సరే; యిక "దేవుని ఎదుట ప్రమాణను" గురించివారు చెప్పారు. దాన్నిగురించి నేను చెప్పనవసరంలేదు. వారిధోరణి అంతా ఉపన్యాసధోరణే. వారు అన్నివిషయాలు తెలుసుకొనికూడా యిక్కడ define చేసుకోవాలని, వ్యక్తులు త్రాగుతున్నారు, త్రాగబోతున్నారు అని చెప్పిరి. వారు త్రాగుతున్నారోలేదో కాని, అదిమాత్రం నాకు బాధపుట్టించింది. Foreign liquor పైన పన్ను వేస్తున్నారా అని అడిగారు. అదిహెచ్చుగానే వేస్తున్నాము. కాని దానికి కొంత policy observe చేయవలసివున్నది.

శ్రీ నరసింహారెడ్డిగారు, లేబర్సును త్రాగిస్తే, వారుచేసేపనిలో కొంత efficiency కూడా పెరుగుతుంది అని అన్నారు. Efficiency పెరుగుతుందో లేదోకాని; దానివల్ల ఎక్కువపనిచేస్తారని నేను అనుకోను. కాని వారి energy మటుకు అంతా పోతున్నప్పుడు యింకా ఎక్కువపని ఎట్లాచేస్తాడు అని అనుకుంటాను. నరసింహారెడ్డిగారు వారియొక్క దేహానికి ఆరోగ్యముయిస్తుందోలేదోగాని, వారిచేత efficiency ఎక్కువచేసి turn over ఎక్కువచేయటానికి వారు సహాయముచేస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ దశరథరామయ్యగారు దేశానికి అవసరమైన ఒక పెద్ద సంస్కరణనుగురించి చెప్పారు.

శ్రీగారపాటి సత్యనారాయణగారు చాలాదూరము గట్టిగాచెప్పారు. వారు చెప్పింది ఏమిటంటే, "Prohibition ను గురించి discuss చేయటానికి ఒకరోజు కేటాయించి మమ్ములను బ్రతికించండి బాబూ!" అని అర్థించారు. వారావిధంగా మాట్లాడడము మన యొక్క గౌరవానికి భంగమని మనవిచేస్తున్నాను. ప్రతిఒక్కరిని బ్రతికించటానికి చంపటానికి అనుగుణమైన పద్ధతిలో యీ ప్రభుత్వాన్ని నడపడములేదు. అందరికీ Law అనేది ఒక్కటే, అది అందరికి వర్తిస్తుందని అంటున్నాము. నేను దానికి జడిసేవాణ్ణి కాదు. ఈప్రభుత్వము అలాంటివాటికి జడవదు. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి ప్రభుత్వములో వున్నవారు త్రాగుతున్నారని అన్నారు. ఆవిధముగా అనడం న్యాయముకాదు. ఈప్రభుత్వముమీద నమ్మకములేదని అవిశ్వాసతీర్మానం తీసుకొని రావచ్చు. అప్పుడు మేము తప్పకుండా రాజీనామా

యివ్వటానికి సిద్ధంగా వున్నాము. మేము చేయవలసినది, కృషిక్ లోక్ పార్టీవారు ఒక మంచిచేస్తున్నారు. అది మేమే తీసుకొనిరావలసినది. ఆ తీర్మానము మేము తీసుకొని రావటానికి బదులు వారే తెచ్చారు. మాకు అందుకు చాలా సంతోషము. దానిలోని విషయాలు మేము తీర్చి దిద్దటానికి వీలులేదు. ఆంధ్రకేసరి అనిపించుకున్న ప్రకాశంపంతులు గారు చాలా అనుభవంగడించినవారు. పెద్దవారు దేశముకోసము ఎంతోకష్టపడి సేవచేసినారు. వారిని అనడము మంచిపద్ధతి కాదు. వారు దేనికోసము పని చేస్తున్నారో, వారు మరొకదాని కొరకు చేస్తున్నారో, దాన్నిగురించి యిక్కడ ప్రస్తావించడము మంచిదిగాదు. సత్యనారాయణగారు వారినిగురించి ప్రకటించడము అనవసరం అని చెబుతున్నాను.

శ్రీ లక్ష్మణదాసుగారు కూడా ప్రభుత్వాన్ని support చేశారు. సాగి సూర్య నారాయణరాజుగారు యిప్పుడు యిక్కడ లేరు. అయన వున్నట్లయితే, నేను వారు చెప్పిన విషయాలకు సమాధానము చేప్పేవాడిని. వారు యిక్కడ లేరుగనుక నేను చెప్పనవసరము లేదు. తరువాత ప్రగడ కోటయ్యగారు prohibition విషయములోని కష్టసుఖాలు చెప్పారు. శ్రీ M V Subba Reddi గారు మద్యనిషేధము విఫలమయిందనిన్నీ, సత్యాగ్రహులను విడుదలచేయాలని కోరడములో అసలు మద్యనిషేధము రద్దుచేయాలంటే సత్యాగ్రహము చేయడము సరియైనపద్ధతి కాదనిన్నీ, అసలు ఏ కార్యక్రమానికి గూడ అది సరియైనపద్ధతి కాదనిన్నీ చెప్పారు. ఈమద్యనిషేధచట్టము ఉల్లంఘించటానికి వ్యక్తులు ఉన్నారని అనుకుంటాను. అయితే సత్యాగ్రహము అనేమాట ఉపయోగించడము అనేది తప్పు అని నేను అనుకొంటున్నాను.

శ్రీ N. V. Rama Rao గారు వారియొక్క మామూలుధోరణిలో చెప్పారు. వారు చెప్పడములో ఎంతదూరము వెళ్లారంటే; యింతవరకు papers లో వ్రాసిన సంగతులను బట్టి ప్రభుత్వము ప్రజలను మభ్యపెట్టుతున్నట్లుగా చెప్పారు. అది సరికాదు. అది చాలా అన్యాయమైన అభిప్రాయము. కమిటీ రిపోర్టు రాగానే discuss చేయండి అని చెప్పాను. కమిటీ రిపోర్టు వచ్చినతరువాత చూద్దాము. (Interruption)

Sri N. V. Rama Rao :— నేను నాగిరెడ్డిగారు మొదలైనవారమంతా అబద్ధాలాడేవారమన్న మాట, మంత్రి పట్టాభిరామారావుగా రొక్కరే సత్యసంధులు కాబోలు.

Sri G. Latchanna :— దేశపరిస్థితులను పరిష్కరించేందుకు ప్రభుత్వము అప్పుడప్పుడు కమిటీలను వేసినప్పుడు వారు పంపిన నివేదికలలోని సూచనలను ప్రభుత్వము ఆచరణలోనికి తీసుకొనివస్తుందా లేదా ?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— పరిస్థితులను తెలుసుకో టానికి, ప్రజాభిప్రాయము కనుగొనటానికి ప్రభుత్వము కమిటీలను వేసి వారిద్వారా తెలుసు కుంటుంది. అంతమాత్రాన వారు యిచ్చిన సూచనలను అమలులోకి తప్పకుండా తేవలెనని ప్రభుత్వమునకు బాధ్యతలేదు. నివేదికలను పరిశీలించి అవసరమనితోస్తే అమలుకు తెస్తుంది.

27th May 1954]

Sri G. Latchanna — మన ఆంధ్రప్రభుత్వము ఏర్పడినతరువాత ఆంధ్రదేశముయొక్క యథార్థ పరిస్థితులను పరిశీలించటానికి కమిటీని వేయలేదా ?

The Hon. Sri S. B. P Pattabhirama Rao — ఆంధ్రప్రభుత్వము ఏర్పడిన యీ ఆరుమాసములలో ఆంధ్రదేశపరిస్థితులు ఏవిధంగా వున్నవో తెలుసుకోటానికి ప్రభుత్వము కమిటీని వేసింది. వారి నివేదిక పరిశీలనలో వున్నది.

శ్రీ M. Subba Reddi గారు కూడా మద్యనిషేధాన్ని రద్దుచేయటానికి సుముఖంగా లేరు.

Sri T. Nagi Reddi — నేను ఒక చిన్నవిషయము చెప్పడము మరచిపోయాను. మద్యనిషేధము రద్దుచేయడము విషయములో యిప్పుడు జరిగేచర్చల ననుసరించి, ఆకమిటీ రిపోర్టులోని అంశములను అమలులో పెట్టుతారా లేదా అని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను.

The Hon Sri S. B P. Pattabhirama Rao.— అది అమలులో ప్రభుత్వము పెట్టుతుందనే ఊహ బహుశః నాగిరెడ్డిగారికి వుంటే వుండవచ్చు, అవి ఆచరణలో పెట్టుతామని నేను చెప్పలేదు. వాన్ని పరిశీలించినతరువాతనే చెప్పగలను. తరువాత శ్రీ ఆంజనేయులుగారు ఒక విషయము చెప్పారు. అది ఏమిటంటే కల్లుదుకాణాలు ఎక్కడెక్కడ వున్నవో వారు లెక్కలువేసి చెప్పారు. అలాంటివి మా నోటీసుకు తెస్తే నేను విచారిస్తాను. మామూలుగా ఆ దుకాణాలు ఎక్కడెక్కడ వున్నవో తెలుసుకోటానికి వీలం లేదని అనుకుంటాను. ఆటువంటివి ఎక్కడైనా వుంటే విచారించి చర్య తీసుకుంటాను.

శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డిగారు చెప్పినవిషయాలన్నీ తెలుసుకొంటాను.

శ్రీ రొక్కం లక్ష్మీనరసింహందొరగారు కొన్ని ముఖ్యవిషయాలను చెప్పారు. వారు కొంచెము దీర్ఘంగా ఆలోచించి యీ విషయాలను సమగ్రంగా చెప్పారు. వారు ఉపన్యాసములో చెప్పినవిషయాలను నేను విన్నతరువాత, వారు చెప్పినదానిలో కొంత యదార్థము వుందని చెప్పక తప్పదు. వారు చెప్పినదానితో నేను సంపూర్ణముగా యేకీభవించాను. (Interruptions)

అధ్యక్షా! వారు యే పార్టీవారైనా, యెన్నిప్రశ్నలువేసినా, ప్రశ్నలకాలంలో వేసిన ప్రశ్నలకు, ఉపప్రశ్నలకు అన్నిటికీ సమాధానములు నేను చెప్పుతున్నాను. కాని యిప్పుడు నేను మాట్లాడుచుండగా, వారు మాట్లాడుతూ, నా ప్రసంగమునకు అవరోధము కల్పిస్తున్నారు. వారు మాట్లాడుచున్నప్పుడు నేను యెన్నడూ అడ్డగించలేదు.

శ్రీ దొరగారు చెప్పినవిషయాలతో నేను యేకీభవిస్తున్నాను. వారి సవరణను పరిశీలించటానికి ఆమోదించవచ్చునని తోచింది. దానికి నేను నా సమ్మతిని తెలియచేస్తున్నాను. దానిని ఆమోదించవలసినదిగా సభవారిని కోరుతున్నాను.

Sri G. Latchanna :— On a point of information, Sir; ఇప్పుడు అడిగేదానికి మంత్రిగారిని సమాధానము చెప్పమని నేను కోరుతున్నాను.

శ్రీ నరసింహందొరగారి ఉపన్యాసం విన్నతరువాత మంత్రిగారికి దానిని బలపరుద్దామనే భావం కలిగినదా, లేక అదివరకే దానిని బలపరుద్దామనే భావము యేమైనా కల్గినదా?

The Hon Sri S B P. Pattabhirama Rao — వారి హృదయం లోకి దూరగలిగే భావం వారికుండే మోగాని నాకులేదు.

Sri G Latchanna — వారి హృదయంలోకి దూరగలభావం తెలుసుకోన్నా రనికాదు, నేను అడిగిన ప్రశ్న. మంత్రిగారికి శ్రీలక్ష్మీనరసింహదొరగారి ఉపన్యాసం విన్న తరువాత ఆభావం కల్గిందా? లేక దానికి ముందు కల్గినదా?

The Hon Sri Parttabhirama Rao — వారి ఉపన్యాసము విన్నతరు వాతనే కల్గిందని నేను చెబుతున్నాను.

Mr. Speaker :— May I take it, you have finished your speech.

The Hon. Sri. S. B. P. Pattabhirama Rao.— I have 40 minutes out of which I have taken 30 minutes so far.

శ్రీ పి. వి. జి. రాజుగారు సహజసిద్ధంగా Constitutional Expert అంటకోవటం Constitutional point మాట్లాడటం క్రొత్తగాదు. వారు మాట్లాడుతూ constitutional points ను అనేకము తెలియజెప్పారు. వారిని నేను అడగవలసిన ప్రశ్న యొవరో అడిగారు. Travancore-Cochin State లోయీ Prohibition విషయంలో వారి గవర్నమెంటు యేమీ చేయలేదని, యింకొక గవర్నమెంటు విషయం మాట్లాడటం అనవసరమని అనుకుంటున్నాను.

ఇంకొకవిషయం కాంగ్రెసుకు ముందుగానే అక్కడ అధికారములో వున్న మిశ్రమ మంత్రివర్గంలో యీ ప్రజాసోషలిష్టు మంత్రివర్గంవారు యీ Prohibition ను extend చేస్తున్నట్లు పత్రికలలో చూచాను. అక్కడ కాంగ్రెసువారు పత్రిపక్షంలో వున్నారంటు న్నారు. Congress కాని వారు ప్రజలకు యెంతగా వుపయోగపడుతోందని భావిస్తున్నా రో, కాంగ్రెసువారూ అదే భావముతో వున్నారు. కాంగ్రెసువారు దానిని ప్రతిఘటించ లేదు. అంతేకాకుండా దేశమంతటవున్న యీ Prohibition వల్ల గౌరవము మనకు కల్గింది.

తరువాత శ్రీ గౌతు లచ్చన్నగారు, మన మాజీమంత్రిగారు వారు యేదో యీ prohibition ను శవంతో పోల్చి చెప్పారు. వారు ఎదో భావంలో యెంతగానో మాట్లాడారు. వారు చాలా పెద్ద leader. వారి భాష నాకురాదు. (Interruption).

Sri G. Latchanna :— వారు ఆ భాషను కొంచెము అనుసరించవలసిన వారుగా అనుసరిస్తే మంచిదని అనుకొంటున్నాను. దానికి personal explanation చెప్పాలంటే (Interruption)

Mr. Speaker — This is not the way of carrying on a debate. Hon. Members should wait till the Minister finishes his speech, and then ask for clarification of points. Otherwise nothing will be served by interrupting him for each and every sentence.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — I have not disturbed them in their speech when they cast aspersions on me. At present, in my reply, I am replying to their statements.

తరువాత, యిదే Prohibition సమస్యపై భేధాభిప్రాయము వచ్చి వారు అంత వరకు మంత్రివర్గంలో వుండి తమ మంత్రిపదవికి రాజీనామా నిచ్చారు. కాబట్టి అదే విధంగా యిప్పుడు Prohibition మీద తీర్మానము నెగ్గింది, కాబట్టి మంత్రివర్గంలోంచి వచ్చి, రాజీనామా యివ్వవలసినదని సలహా నిచ్చారు. వారావిధంగా సలహా నిచ్చారంటే సహజంగా—తోక తెగిన నక్క యేమిచేస్తుంది ? అది దానికి సహజమే. (Laughter)

Sri G. Latchanna rose to speak.

Mr. Speaker .— The Hon. Minister is not yielding.

Sri G. Latchanna kept standing in his seat.

Mr. Speaker :— The Hon. Minister will please resume his seat;

Mr. Speaker :— Now raise the point of order.

Sri G Latchanna —నేను point of order raise చేస్తున్నాను. "తోక తెగిన నక్క" అనే పదప్రయోగము యిదివరకు మంత్రివర్గమునుండి రాజీనామా యిచ్చిన వారికి అందరికీ వర్తిస్తుందా ? ఆ సాంప్రదాయము యీ parliamentary భాషలో వుందా ? అది వుంటే, అందరికీ వర్తిస్తుందా ? అని.

Mr. Speaker ·— అందులో point of order యేమీ లేదండి.

The Hon Sri S. B P. Pattabhirama Rao .— నక్క చాలా తెలివైనదండి. అందువల్ల "నక్క" అనే పదం వుపయోగించాను. "నక్క" అనే మాట "చాలా తెలివైనది." అనేభావంతో వాడాను. (Interruption)

Sri G. Latchanna :—అది insinuation కాదా ? "తోక తెగిన నక్క" అనే పదప్రయోగము Insinuation క్రింద వస్తుంది కదా ? అందువల్ల అధ్యక్షులవారు దానిమీద ruling యివ్వాలని నేను కోరుతున్నాను. దయచేసి నేను అడిగినదానిమీద clarify చేస్తూ తమ రూలింగు యివ్వండి.

Mr. Speaker :— There is no insinuation at all. What does it mean? It is quite parliamentary, I think. There is nothing unparliamentary in it. If it is casting aspersions against any individual, let it not be used again.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— Sir, when I entered the chamber this afternoon, I came in with the sleeves of my shirt tucked up. On seeing me in this fashion, the hon. Member remarked, "Look here, he is coming as though to fight."

నేను యేదో చేతులుయెత్తి మాట్లాడుతున్నందులకు వారికి కోపంవచ్చివుండవచ్చు. కాని వారు అప్రస్తుతమైన విషయాలు చెప్పినందువల్ల, దానికి నేను జవాబుచెప్పవలసి వచ్చింది

Mr. Speaker :— No member should indulge in such personal attacks.

Sri G Latchanna — అధ్యక్షులవారు యిచ్చిన రూలింగు అట్టి పద ప్రయోగము parliamentary అని యిచ్చారా ? లేక unparliamentary అని యిచ్చారా ? తమరూలింగు విశదముగా తెలుపుతారా ?

Mr. Speaker · — ఏదో యిచ్చాను. (Interruptions) Order, Order. I now say it is unparliamentary

Sri G Latchanna — అది ధర్మమా ? అని అడుగుతున్నాను.

Mr. Speaker :— The Hon. Minister has explained himself; I think it is unnecessary to speak about it. He can proceed with his speech.

The Hon Sri S. B. P Pattabhirama Rao .— అయినా వారికి యెంతోబాధ కల్గుతూన్నప్పుడు యింకా యెన్నోవారు చెప్పినవిషయాలను గురించి నేను జవాబుచెప్పవలసినా, యిప్పుడు వాటికి జవాబు చెప్పదలచలేదు.

శ్రీ M. Subba Reddi Garu, permit holders కు liquiors కు permits జాస్తిగా యివ్వమనిచెప్పారు. వాటిని medical certificates మీద యివ్వ వచ్చునని సలహాలుచెప్పారు. అందుకు యిబ్బందియేమీలేదు. అసలు రామమూర్తి కమిటీ రిపోర్టులో అటువంటిది యెంతవరకు అంగీకరిస్తారనే ఆలోచనచేయడానికి సూచింప బడినది అని అనుకొంటున్నాను. కల్లు త్రాగడానికి సలహాలు యివ్వటం లోకవిరుద్ధమని చెబు తున్నాను. అందుకే శ్రీ రొక్కం లక్ష్మీనరసింహందొరగారు యిచ్చిన amendment ను అంగీకరించటం మంచిదని అన్నాను. అది పూర్తిగా ప్రజలకు వుపయోగపడుతుంది. ఆ అభి ప్రాయముతో ఆ amendment ను అంగీకరిస్తే వీలుంటుందని, అందువల్ల R. L. దొరగారి ఆ amendment వుపయోగపడుతుందని చెబుతున్నాను. ఈ Prohibition policy యెంతవరకు లాభదాయకంగావుంటుందో అంతవరకు అమలుపర్చడానికి, శ్రీ రామమూర్తి కమిటీ రిపోర్టు పరిశీలించి అంతవరకే అంగీకరిస్తాను. ఆంధ్రరాష్ట్రం యేర్పడిన తర్వాత యెన్నో చిక్కుసమస్యలు వచ్చినవి. నేను Prohibition ను రద్దుచేయడానికి

27th May 1954] [The Hon. Sri S. B. P. Pattabhirama Rao]

అంగీకరించినా, Act తీసివేయడానికి వెంటనే తొందరపడిచేస్తే, అందులో చాలా చిక్కులువున్నాయి. అట్టి అవకాశము కలుగకుండా నీరాపద్ధతిని, రామమూర్తి కమిటీనివేదికను ప్రభుత్వము వివరంగా పరిశీలిస్తుంది. శ్రీ వెంకటయ్యగారుచెప్పినవిషయం, వారు కొంత technical knowledge తో, వారు చదువుకొన్న వారు కనుక, ఒక policy ని యిచ్చారు. ప్రభుత్వము ఆనీరానుకాచి, బెల్లంచేసి, పిమ్మట దానిని పంచదారగా చేసేందుకు ఒక scheme ను యిచ్చారు. ఆ scheme ప్రభుత్వపరిశీలనలోవుంది. ఆ scheme ను వుపయోగించితే, మాజీగీతపనివారికి చాలా లాభదాయకము. వారిని బాధపెడదామని, కష్టపెడదామని మావుద్దేశ్యంకాదు. వారికి బంజరుభూములు యిస్తాము. అది ప్రభుత్వ ఆలోచనలో వున్నది. ఇదివరకు వృత్తిపోయినవారికి మంచిమార్గంలో మేలు చేయడానికి ప్రభుత్వము యోచనచేస్తున్నది. ఆటువంటి సంఘ సంస్కరణలు అమలుజరపడానికి కొంత కాలంపడుతుంది. అందుకు కొంచెము వోపికపట్టాలి. వారికి State Government (Interruption) అందువల్ల, నీరాగాని, కల్లుగాని తీసేవాళ్ళకు వృత్తి కల్పించమని చెపుతున్నారు. అందువల్ల ఈవృత్తిపోయినవారికి వృత్తికల్పించడం న్యాయమేకాని, అందుకోసమని వాళ్ళను కలకాలం, తరతరాలుగా ఈవృత్తిలోనే ఉంచడం మంచిదికాదు. ఇప్పుడు నాకొడుకు వ్యవసాయం చేయడంలో తప్పేమీలేదు. నేను వ్యవసాయంచేస్తే నాకొడుకు వ్యవసాయంచేయాలని ఎక్కడుంది? డాక్టరు కొడుకు, డాక్టరుకావాలని, లాయరుకొడుకు లాయరుకావాలని ఎక్కడుంది? కాబట్టి నీరా తీసేవాళ్ళకొడుకులు నీరానేతీయడం మంచిదికాదు. ఆలాతీయాలంటే తీయవచ్చు. కాని ఈపనిపోయినవాళ్ళకు ఎన్నో కన్‌సెషన్స్ ఇస్తాం, వాళ్ళకు అన్నివిధాలా సౌకర్యాలు కల్పిస్తాం అని చెపుతున్నాను. అదేకాకుండా వాళ్ళకు నీరా తీయడానికికూడా అనుమతిస్తాం. ఏదైనా ఒకసోషల్ రిఫారం ప్రజల్లో తీసుకురావడానికి కొంత కాలం పడుతుంది. ఈనాడు ఇది fail అయిందని అనుకోడం ధర్మంకాదు. అందుచేత మనం కొంచెం ఓపికతో పనిచేయడంమంచిది. అయితే డిపార్టుమెంటు కొంతపనిచేసిఉంటే బాగుండేది. కాని అనుకున్నంతసరిగా పనిచేయలేదని నేను ఒప్పుకొంటున్నాను. కాని వాళ్ళనుకూడా నేను నిందించడంలేదు. ఏదైనా ఒక సోషల్ రిఫారం చేయవలసివచ్చినప్పుడు దానికి కొంతవరకు ప్రజా సహకారంకూడా ఉండాలి. ఎందుచేతంటే ఇది ప్రజలకు లాభంచేస్తుంది. కాబట్టి ప్రజలు సహకారంఇచ్చి, దీన్ని ప్రచారంచేస్తే సాంఘికవిషయమైన ఈ మద్యనిషేధాన్ని తప్పకుండా జయప్రదం అయ్యేట్లు చేయవచ్చు. ఒక జనరేషన్ అయ్యేటప్పటికి వాళ్ళను బాగా తెలియచేయవచ్చు. ఇంకోవిషయం. మద్యనిషేధం తొలగించమంటున్నారు. దాన్ని తొలగిస్తాం. కల్లుఅంగళ్లు పెడతాం. ఆ కల్లు అంగళ్ళకు మనబిడ్డవెళ్ళి కల్లు త్రాగుతున్నాడని తెలిస్తే ఏతలితండ్రులకు బాగుంటుందని అడుగుతున్నాను. సుందరాంగుడు కానివ్వండి, అధికారంఉన్నవాడే కానివ్వండి, చాలాడబ్బున్నవాడే కానివ్వండి. కల్లు త్రాగుతుంటే ఏతల్లితండ్రులు సహించగలరు? మన సంస్కృతి, మన హిందూదేశ సంప్రదాయం, మనపద్ధతులు ఉన్నాయి. మనపద్ధతులను మనం ప్రతిబింబించడానికి అలవాటుపడ్డాం. యూరపుదేశాల్లో

[The Hon. Sri S. B. P. Pattabhirama Rao] [27th May 1954

ఒకబల్ల మీద తలిదండ్రులు, పిల్లలు, మనమళ్లు కూర్చొని త్రాగడానికి అలవాటుపడవచ్చు, కాని మనదేశంలో అది లేదు. నేనింతవరకు మనవిచేసినట్లు శ్రీరామమూర్తికమిటీ పరిశీలించిన దానిలో ఆచరణకు పనికివచ్చేవాటిని ఆచరణలో పెడతాం. Liquor permits ఇస్తే, ఆలా permits ఇవ్వడంవల్ల తెలియనివాళ్ళను, పేదవాళ్ళను త్రాగించి వాళ్ళను వీధుల్లో త్రిప్పడంమంచిది కాదు. కాబట్టి ఆవన్నీ వీలైనంతవరకు ఆలోచిస్తాం. ఈ లోపునే నీరా తీయడానికి అనుమతిచ్చి వాళ్ళకు వృత్తికల్పిస్తాం. ఇప్పుడు వారు పర్మిట్ల సిస్టంమీద ఇమ్మని చెపుతున్నారు. కాని ఏ పర్మిట్లసిస్టం అయినా సరిగా జరిగిందా అని అడుగుతున్నాను. కాబట్టి ఇందులోఉన్న difficulties చూడకుండా ఏమీచేయడానికి వీలుకాదు. ఇంకా కొంతవరకు చూడ్డానికి వారికిఅవకాశం కల్పించిఉంటే ఇంకా రిపోర్టులోఉండిఉండేది. కాబట్టి ఎవరికీ కష్టంలేకుండా దీనిమీద న్యాయమైన నిర్ధారణ చేయమని మిమ్మల్ని కోరుతున్నాను.

Mr Speaker :— ఇంతటితో దానిమీద చర్చ ముగిసింది. ఈ సవరణలు సభవారి ఓటుకు పెడుతున్నాను.

సవరణలు చాలా ఉన్నాయి. ఇందులో మూడుమాత్రం నేను ఓటుకు పెట్టతలస్తున్నాను.

మొదటి సవరణ — శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ పి. వి. శివయ్య, శ్రీ ఎన్. శివరామిరెడ్డిగార్ల పేరుతో ఉంది కలిపి "and on such consideration this Assembly resolves that the recommendations contained in the report be implemented by the Government forthwith"

రెండవది— Sri C. Subbbarayudu

Add at the end the following:

"and on such consideration this Assembly resolves that the recommendations of the Ramamurthi Committee should be examined and such steps as are necessary for the successful implementation of Prohibition policy be taken."

మూడవది :— Sri R. Lakshminarasimham Dora

Add at the end, the following:

"and on such consideration recommends to the Government that the recommendations of the the Ramamurthi Committee should be examined in detail and action taken and that in the meanwhile the Government should create employment to the ex-toddy tappers by utilising Sweet Toddy rules and also utilise all surplus neera for conversion into jaggery with the aid of suitable machinery set up for the purpose."

ఈ మూడుసవరణలు మాత్రం తీసుకుంటున్నాను. మిగిలినవి తీసివేస్తున్నాను.

[27th May 1954

Sri Pragada Kotaiah — మిగతా సవరణలు ఎందుకు రావని అడుగుకున్నాను.

Mr Speaker :— చాలావరకు సవరణలు కమ్యూనిష్టులు ఇచ్చినవి ఉన్నాయి వారు వదులుకున్నారు. కమ్యూనిస్టులు ఇచ్చినవికాక మిగిలినవి ఈ మూడుసవరణలలో include అవుతాయని చెపుతున్నాను.

3 సవరణలు వరుసగా ఉన్నాయి. చాలాసవరణలు వచ్చాయి. అందులో కమ్యూనిస్టు పార్టీవారు యిచ్చినవి సవరణలన్నీ చాలా ఉన్నాయి. కొద్ది ఇంచుమించు అన్నీ ఒక్కలాగే ఉన్నాయి. చాలా సవరణలను కమ్యూనిష్టుపార్టీవారు యిచ్చారు. ఇవిఅన్నీ ఒకలాగే ఉన్నందువల్ల అందులోనుంచి ఒకటే సవరణను ఈ సభముందు పెట్టి ఓటింగ్‌కు పెడతాను ఒకటి వావిలాల గోపాలకృష్ణయ్యగారిది, రెండవది P Venkateswarlu గారిది, మూడవది C. Subbrayudu గారిది. ఈమూడింటిని మనం వోటింగుకు పెడదాము. తతిమ్మా సవరణలు అన్నీ ఊరికే move చేసినట్లవుతాయి.

Sri Pragada Kotaiah — నాసవరణ ఒకటి వుంది దానినికూడా యిందులో include చేసి ఈసభలో ఓటింగ్‌కు పెట్టాలని మనవిచేస్తున్నాను నేను యిచ్చిన సవరణకు ఈసవరణకు ఏమాత్రం సంబంధంలేదు. అదివేరు ఇదివేరు. అందుచేత దానినికూడా ఓటింగ్‌కు పెట్టే సవరణల list లో include చేయాలి. నాసవరణ ఒకసారి చూస్తే తెలుస్తుంది. నాసవరణ ఏమిటంటే, ex-toddy tappers కు బంజరుభూములను ఇవ్వాలని, పంచదార పరిశ్రమకు అవసరమయ్యే నీరాను ఉత్పత్తిచేయటానికి వారికి అవకాశం కల్పించాలని నాసవరణ. ఇది మిగతా వాటిలాగలేక వేరుగా ఉన్నది అందుచేత దీనినికూడా ఓటుకు పెట్టాలని కోర్తున్నాను.

Sri P. V. R. Gajapathi Raju :— You said a little while ago, that there are three amendments and the main resolution to be put to vote. May I suggest to you, that if one of the amendments is put to vote and suppose it is carried, the other two amendments need not be put to vote; otherwise it would land the House in the same utter confusion which prevailed at the time the Capital question was discussed; and then the main resolution may be put to vote.

Mr. Speaker :— Sri P. Kotaiah's amendment is out of order.

అందువల్ల దానిని తీసిపారేశాను. (రెండవది The question of procedure is this) మొట్టమొదటి సవరణ గోపాలకృష్ణయ్యగారు, P V. Sivayya గారు, శివరామ రెడ్డిగారు ఇచ్చినది. ఈ సవరణను ముందు ఓటింగ్‌కు పెడతాను. ఈ సవరణ నెగ్గితే, ఈ సవరణను అసలు motion కు చేర్చి, తిరిగి ఓటుకుపెడతాను. ఈ సవరణకనుక ఓడిపోతే, 2 వ సవరణ సుబ్బారాయుడుగారిది ఓటుకుపెడతాను. అది నెగ్గితే main resolution కు చేర్చి వోటుకు మళ్లీపెడతాము. లేకపోతే 3 వ సవరణ ఓటుకు పెడతాము. మొదటిసవరణ నెగ్గితే మిగిలిన సవరణలను తీసుకోనవసరం ఉండదు

Sri P. Kotaiah rose to speak.

Mr. Speaker :— Point of order against what ?

Sri P Kotaiah — నా amendment మొదట ఈ సభలో అంగీకరించబడింది, బలపర్చబడిందికూడా. దానిమీద చర్చకూడా జరిగింది. కాని ఇపుడు అధ్యక్షులవారు అది out of order అని ruling యిచ్చారు. అలాకాకుండా దానిపై చర్చజరిగింది కనుక నా amendment ను కూడా ఓటుకు పెట్టవలసిన అవసరం ఉంది. ఆర్డర్ of priority దృష్ట్యా చూచినా నా amendment ఈ 3 సవరణలతోబాటు ఓటింగ్‌కు రాదనడంలో అర్థంలేదనుకుంటాను.

Mr Speaker ·— అర్థం ఉంది. మీ amendment ను ఆ విధంగానే rule out చేశాము.

Every amendment was considered and whichever is not in order is rejected. Your amendment is in that position.

Sri P. Kotaiah .— I should like to know under what rule.

Mr. Speaker .— It has been ruled out. It need not be explained.

Sri C. Subbarayudu .— (Rose to speak against Speaker's ruling)

Mr. Speaker :—It is disobeying the ruling of the Chair. I am putting the first amendment to the vote of the House. The motion is:

'Add at the end, the following .—

"and on such consideration this Assembly resolves that the recommendations contained in the Report be implemented by the Government forthwith."

The motion was carried.

Mr. Speaker :— I shall now put the main resolution as amended to the vote of the House. The question is :

"That the Report of the Andhra Prohibition Enquiry Committee appointed by the Government, in G. O. Ms. No. 13, Revenue, dated 6th January 1954, and Memorandum No. 17156-4/53-10 dated the 9th Janury, 1954, be taken into consideration and on such consideration this Assembly resolves that the recommendations contained in the Report be implemented by the Government forthwith."

The motion was carried. Amidst Opposition applause.

It was not pressed to a division.

Mr. Speaker :— The House will now adjourn to meet again at 9 A. M. tomorrow the 28th May 1954.

The House then adjourned.

---

# APPENDIX No. I

[VIDE ANSWER TO SHORT NOTICE STARRED QUESTION No. 653 PUT BY SRI V SRI KRISHNA, M L. A AT THE MEETING OF THE LEGISLATIVE ASSEMBLY HELD ON 27-5-54 Page 98 Supra]

SUBJECTS DISCUSSED AT THE CONFERENCE OF THE COLLECTORS AND OTHER OFFICERS AT KURNOOL ON THE 19TH AND 20TH FEBRUARY, 1954

1. Prohibition-working.
2. Review of Food Position and Procurement.
3. Progress of Community Projects.
4. Popularisation of Telugu as official language.
5. Law and Order.
6. Power Projects.
7. Reorganisation or Replacement of District Boards.
8. Formation of new Districts.
9. Assignment of Banjar lands.
10. Amendment of the Madras Hereditary Village Officers Act.
11. Simplification of Land Acquisition proceedings.
12. Collection of loans given by the Agricultural Department.
13. Payment of salaries to Elementary school teachers.
14. Payment for famine works.
15. Selection of Deputy Thasildars to be made on the basis of an interview to be held by the Service Commission and the cadre of Deputy Tahsildars and Tahsildars to be centralised on a State level.
16. Making the election staff permanent.
17. Lottery Scheme.
18. Making temporary staff working for more than five years permanent.
19. Stoppage of increment.
20. Empowering Collectors to appoint additional staff.
21. Tungabhadra water for second crop in Cuddapah District.
22. Supply of jeeps to Revenue Divisional Officers and Tahsildars.

Sree Rama Press, Madras-21.
31-3-1955